పూర్వపదముయొక్క ఉకారమున
కు లోపమురాఁగా ఐకారము
ఏకారముతో సంధిఁబొందెను.

65. అక్షరస్వరూపమునుబట్టి సంధి రెండువిధములగు.
స్వాభావికసంధి; వికారసంధి.

స్వాభావికసంధి.—అక్షరములు స్వరూపభేదము లేక
ఉన్నట్టే చేరుట.

ఉ. వచ్చెను రాముఁడు.
సూర్యుఁడు వెలసిల్లె.

వికారసంధి—అక్షరములు చేరునప్పుడు రూపభేదము
కలుగుట. ఈసంధి మూఁడువిధములనుండును.

ఆగమసంధి—క్రొత్తవర్ణములు ఆగమముగా వచ్చెడు
సంధి.

ఉ. రాముఁడు = రామన్ + ఉ.
రామన్ + డ్ + ఉ.
రామండు = రాముండు.

ప్రాతిపదికాంతమయిన నకారమునకును ప్రత్యయోకార
మునకును నడుమ డకారము వచ్చినది. ప్రాతిపదికముయొక్క
ఉపధమైన అకారమునకు ఉత్వము. క్రియా. 30 వ విధి చూ.

పసిండి = అ. పయిం + ఇ = పయిన్ + ఇ = పసిన్ + డ్ + ఇ = పసిండి. ఇప్రత్యయము చేరఁగా పయిం శబ్దముయొక్క అనుస్వారమునకు నత్వము. నకారేకారములకు మధ్యమున డకారము ఆగమము.

మామిడి = అ. మావిన్ (క. మావినె) + ఇ = మావిన్ + డ్ + ఇ = మావిండి = మామిండి, వకారము మకారమయ్యె. ఈపదమును ఖండబిందువు లేకయే వ్రాయుచున్నారు.

చేయుండు = చేయుమ్ + ఉ = చేయున్ + డ్ + ఉ = చేయుండు. అ. శెయ్ + ఉమ్ = శెయ్యుమ్.

కండు = అ. ఆగుమ్ + ఉ. తె. అగుమ్ + ఉ = అగున్ + డ్ + ఉ = కాండు = కండు. అగుధాత్వకారము గకారమునకు వెనుకపోయి ఆకారమయ్యె. వర్ణ ప్లుతివిధులను చూడుము. కాండు అని యుండవలసినది సంక్షేపముచేత కండు అయినది.

లోపసంధి—ఉండునట్టి యక్షరమునకు లోపము కలుగుట.

ఉ. కృష్ణుంపరిగెను = కృష్ణుండు + అరిగెను. ఉకారలోపము.
మఱేమి = మఱి + ఏమి. ఇకారమునకు లోపము.

ఆదేశసంధి — ఉండెడువర్ణమునకు మాఱుగా వేఱువర్ణము వచ్చుట.

ఉ. చేతక్ = చేయి + అక్. ప్రాతిపదికాంతమునందుండు ఇకారములోపింపఁగా యకారమునకు తత్వము.

నోటక్ = నోరు + అక్. రేఫమునకు టత్వము. టత్వము
కానిచో నోరక్.

ఏటక్ = ఏఱు + అక్. శకటరేఫమునకు టత్వము.

ఎదుటక్ = ఎదురు + అక్. రేఫమునకు టత్వము. ఎదురక్
అనిటత్వము రాకయునుండును.

చేసి = చేయు + ఇ. ధాత్వంతోకారమునకు లోపము. య
కారమునకు సత్వము.

**66. అచ్చున కచ్చు పరంబగునపుడు న య ర అ వ లు బహుళంబుగా ఆగమంబులగు.**

ఉ. వచ్చినవాఁడు వాఁడేనా

వాఁడేనా = వాఁడె + ఆ = వాఁడే వచ్చినాఁ డాయని ప్రశ్నము. పూర్వపదముయొక్క తుదనుండు ఏకారము అవధారణార్థకము. ఆకారము ప్రశ్నార్థకమయిన యవ్యయము. ఏకారమునకును ఆకారమునకు నడుమ నకారము ఆగమమయ్యెను.

మాయత్త = మా+అత్త. యకారంబు ఆగమంబు.

వారు = అ. అవరు, అ+అరు. అ అనునది తచ్ఛబ్దార్థకమయిన సర్వనామము. అరు బహువచన ప్రత్యయము. వకారము ఆగమము.

తరువు = తరు + ఉ.
గోవు = గో + ఉ
కద్రువ = కద్రు + అ
} వకారము ఆగమము.

ధీరురాలు = ధీర + ఆలు.
గుణవంతురాలు = గుణవంత + ఆలు.
} రేఫము ఆగమము. పదాంతమైన అత్తునకు ఉత్వము.

పేదఱికము = పేద + ఇకము. శకటరేఫము ఆగమము.

**67.** అకారమునకు అచ్చు పరంబగునపుడు అకారమునకు లోపమును యకారాగమమును బహుళంబుగనగు.

ఉ. మేనల్లుఁడు = మేనయల్లుఁడు = మేన + అల్లుఁడు.

పుట్టినిల్లు = పుట్టినయిల్లు = పుట్టిన + ఇల్లు.

**68.** స్త్రీవాచకములయొక్కయు తత్సమ సంబోధనాంతంబులయొక్కయు అంత్యాకారంబునకు లోపము లేదు.

ఉ. అమ్మయిచ్చెను = అమ్మ + ఇచ్చెను.
మాతయితఁడు = మాత + ఇతఁడు.

ప్రియుండయేగుము = ప్రియుండ + ఏగుము.

**69.** వ్యతిరేక క్త్వార్థకముయొక్క అంత్యాకారమునకు అచ్చుపరంబగునపుడు అల్లోపము విభాషనగు.

ఉ. చూడకయరిగెను = చూడకరిగెను = చూడక + అరిగెను.

70. ఉము, ఉండు, ఉ, ఉరె, ఈప్రత్యయములకు పూర్వము ప్రార్థనార్థక కప్రత్యయముయొక్క అకారమునకు లోపము నిత్యము.

ఉ. చేయకుము. చేయకుండు. చేయకు. చేయకురె.

చేయక—గ్రామ్యమునందు ప్రార్థనార్థక అ. శెయ్యక్క. దానికి మధ్యమపురుషనందు ఉము, ఉండు, ఉ, ఉరె ప్రత్యయములు అధికముగావచ్చినవి.

71. పేదాదిశబ్దములకు ఆలుశబ్దము పరముకాఁగా రేఫాగమంబు అగు.

ఉ. పేదరాలు = పేద+ఆలు. జవరాలు=జవ+ఆలు.
బీదరాలు = బీద+ఆలు. అయిదువరాలు=అయిదువ+ఆలు.
ముద్దరాలు = ముద్ద+ఆలు. మనుమరాలు=మనుమ+ఆలు.
బాలెంతరాలు = బాలెంత+ఆలు. గొడ్డురాలు=గొడ్డు+ఆలు.
కొమరాలు = కొమ+ఆలు.

పేద-బీద. అ. పైదె=దరిద్రుఁడు, అశక్తుఁడు.

ముద్ద. సం. ముగ్ధ=అందగత్తె, తెలియనిది.

బాలెంత. సం. బాలవంత్=బిడ్డగలిగినది = ప్రసవవించినది.

జవ. సం. యువ, యౌవనశబ్దతద్భవము; జవ్వని.

72. తత్సమాకారాంత శబ్దములకు తుదియుకారంబునకు ఆలుపరంబగుచో ఉత్వమును అగును.

ఉ. సమర్థురాలు=సమర్థ+ఉ+ఆలు.

బుద్ధిమంతురాలు=బుద్ధిమంత+ఉ+ఆలు.

పూర్వసూత్రముచే రేఫాగమము.

73. సంబంధార్థక ప్రత్యయములయిన అకారేకారములకు అచ్చుపరంబగునపుడు లోపము లేదు యాగమము అగును.

ఉ. నా+ఇల్లు=నాయిల్లు.

నాయొక్కయిల్లు=నాయొక్క+ఇల్లు.

యొక్క అనునది షష్ఠీవిభక్తి ప్రత్యయము.—

అ. ఉద్దైయ అనుదానివలనఁ బుట్టినది. ఆ పదములో అకారము సంబంధార్థక ప్రత్యయము.

ఉ. వారియిల్లు=వారి+ఇల్లు.

తనయిల్లు=తన+ఇల్లు.

మన, మా, మీ, నీ, నా, వారి, వారల తన, తమ మొదలయినవి సంబంధార్థక ప్రత్యయాంతములు.

(సర్వనామప్రకరణము చూడుము.)

## 74. మధ్యమపురుషక్రియల అంతేకారమునకు లోపంబగు.

ఉ. వచ్చితివిచ్చటికి=వచ్చితివి+ఇచ్చటికి, వచ్చితిరిచ్చటికి=వచ్చితిరి+ఇచ్చటికి.

## 75. ప్రథమోత్తమపురుష క్రియల అంతేకారమునకు లోపము వైకల్పికము.

ఇత్తునకు వెనుక అచ్చురాఁగా ఇ లోపంబులేనియెడల యాగమము బహుళంబుగానగును.

| | |
|---|---|
| అదియేమి / అదేమి | = అది+ఏమి. |
| అవియేవి / అవేవి | = అవి+ఏవి. |
| మఱియెప్పుడు / మఱెప్పుడు | = మఱి+ఎప్పుడు. |
| చేయియిచ్చెను | = చేయి+ఇచ్చెను. |
| చేయనియెడల | = చేయని+ఎడల. |

ఇచ్చట యకారము ఆగమముగా వచ్చుటకు కారణము ఇకారము తాలవ్యమగుటయె. ఇట్లె ఉత్తునకు పరముగా అచ్చువచ్చునపుడు దానికి లోపములేనియెడల వకారము ఆగమమగును. ఇట్లు సవర్ణాగమమువచ్చు నియమము అకారాకారములకు లేదు అచ్చులకు మధ్యమున సంధియందు య వ ర ఱ న లు ఆగమములగును. వీనిలో తఱుచుగావచ్చునవి యకారవకారములు. ఈవిధి ఇకారోకారములకువెనుక నిత్యము.

పదాంతస్సంధియందు అ. ఇవర్, తె. వీరు, అ. ఎవర్, తె. ఎవరు అనుపదములందు వకారము సూత్రవిరుద్ధముగా అఱవమునందు ముందువచ్చి తెనుఁగునందును కలిగియున్నది.

76. ఉత్తునకు అచ్చుపరంబగునపుడు లోపంబగును.

| | |
|---|---|
| వాఁడేగెను | = వాఁడు + ఏగెను. |
| పుష్పంబలరెను | = పుష్పంబు + అలరెను. |
| చేయక | = చేయు + అ + క. |

పదాంతస్సంధియందు ఉత్తున లోపములేనియెడ వకారము ఆగమమగును.

| | |
|---|---|
| తరువు | = తరు + వ్ + ఉ. |
| విష్ణువు | = విష్ణు + వ్ + ఉ. |
| గోవు | = గో + వ్ + ఉ. |

ఉకార వకారములు ఓష్ఠ్యములగుటచే సవర్ణములు. కాఁబట్టి ఉకారమునకు పరంబుగ వకారాగమము వచ్చినది.

౭౫ వవిధి చూడుము.

77. ప్రథమా విభక్త్యంతములకు పరమయిన పరుషములకు గ స డ ద వలు బహుళముగా నాదేశంబు లగును.

ఉ. రాజు + కొట్టెను = రాజుగొట్టెను, రాజుకొట్టెను.

కృష్ణుఁడు + చూచెను = కృష్ణుఁడుసూచెను, కృష్ణుఁడుచూచెను.

రావణుఁడు + టక్కరి = రావణుఁడుడక్కరి, రావణుఁడుటక్కరి.

భృత్యుఁడు + తెచ్చెన్ = భృత్యుఁడుదెచ్చెన్, భృత్యుఁడుతెచ్చెన్.

రాముఁడు + పలికెన్ = రాముఁడువలికెన్, రాముఁడుపలికెన్.

రారు + కదా = రారుగదా, రారుకదా.

కూడుదురు + పాయుదురు = కూడుదురు వాయుదురు.

అనియీకార్యము క్రియలకు వెనుకను వచ్చును.

78. తెనుఁగు పదములకంటెఁ బరమయిన సంస్కృతపదంబులయందుండు క చ ట త పలు గ స డ ద వలు గావు.

ఉ. మగఁడు + కరుణించె = మగఁడుకరుణించె.

తమ్ముఁడు + చతురుఁడు = తమ్ముఁడుచతురుఁడు.

కొడుకు + టంకాయుధుఁడు = కొడుకుటంకాయుధుఁ[డు.

తండ్రిమాట + తథ్యము = తండ్రిమాటతథ్యము.

ఈపని + పుణ్యము = ఈపనిపుణ్యము.

79. ద్వంద్వసమాసమునందు పూర్వపదాంతస్వరమునకు పరమయిన పరుషములకు గ స డ ద వలు ఆదేశంబు లగును.

ఉ. కూర + కాయ = కూరగాయలు.

కాలు + చేయి = కాలుసేతులు.

టక్కు + టెక్కు = టక్కుడెక్కులు.

అన్న + తమ్ముఁడు = అన్నదమ్ములు.

రాక + పోక = రాకపోకలు.

కండతుండెములు, అందచందములు. అప్పాచెల్లెండ్రు ఇత్యాది ప్రయోగములును గలవు. "కశ్యపునిభార్యలిరువు రప్పాచెల్లెండ్రనిమిషుల నసుర గణములఁగనిరి." నిర్వచనోత్తరరామాయణము. "అక్కాచెల్లెండ్రయ్యును." భాగ.

80. కర్మధారయ సమాసంబునందు చిఱు మొదలయిన వానికి అజాదిపదములు పరమగుచో పదాంతస్వరమునకు లోపమును లుప్తసర్వమునకు పూర్వమయిన హల్లునకు ట ద్విత్వమునగు.

ఉ. కుఱు + ఉసురు = కుట్టుసురు. అ. కుఱ్ఱుయిర్.
చిఱు + ఎలుక = చిట్టెలుక. ,, శిఱ్ఱెలి.
కడు + ఆణి = కట్టాణి. ,, కట్టాణి.
నిడు + ఊరుపు = నిట్టూరుపు ,, నెట్టుయిర్పు.
నడు + ఏఱు = నట్టేఱు. ,, నట్టాఱు.

వీనిలో కుఱ్ఱుయిర్ శిఱ్ఱెలి అను అఱవపదంబులందు శకట రేఫద్విత్వమునకు టకారద్విత్వము ఆదేశము.

81 వేముప్రభృతులకును కనుము ప్రభృతులకును సంబంధార్థకమయిన అప్రత్యయము వచ్చును. వేముప్రభృతుల మకారమునకు బిందుపూర్వక పకారమును కనుము ప్రభృతుల మకారమునకు పకారమును ఆదేశంబులగు.

ఉ. వేము + అ + చెట్టు = వేఁపచెట్టు.
పాము + అ + ఱేఁడు = పాఁపఱేఁడు.
నాము + అ + చేను = నాఁపచేను.
అమ్ము + అ + ములికి = అంపములికి.
ఎమ్ము + అ + గూఁడు = ఎంపగూఁడు.
కనుము + అ + గడ్డి = కనుపగడ్డి.
ఇనుము + అ + దారి = ఇనుపదారి.
మినుము + అ + పప్పు = మినుపపప్పు.

ఎనుము + అ + దూడ = ఎనుపదూడ.

జనుము + అ + నార = జనుపనార.

వేము, నాము, పాము, ప్రేము, అమ్ము, ఎమ్ము, వేము ప్రభృతులు. కనుము, ఇనుము, ఉడుము, ఎనుము, జనుము, మినుము - కనుము ప్రభృతులు.

ఈశబ్దములలో కొన్ని అజివమునందు బకారాంతముగా నుండును. సంధియందువచ్చు పకారము ఆ బకారస్థానమందె వచ్చుచున్నది.

అ. వేమ్బు + అ + కాడి = వేప్పంకాడి.

**82.** అందు అను సప్తమీవిభక్తి ప్రత్యయము అంతమునందు కలిగినపదమునకు పరంబుగ సమాసమునందు షష్ఠ్యర్థకములయిన, అన్ ఇ ప్రత్యయములు వచ్చును.

ఉ. నాయందు + కరుణ = నాయందు + అన్ + ఇ + కరుణ = నాయందని కరుణ = నాయంవలికరుణ. అన్ ప్రత్యయముయొక్క నకారమునకు లత్వము.

**83.** ద్రుతప్రకృతికముయొక్క అంత నకారమునకు పరముగవచ్చు పరుషములకు సరళంబులు ఆదేశంబులగు. ఆదేశములయిన సరళములకు ముందు నకారమునకు సంశ్లేషమును, అనుస్వారాదేశమును, స్వత్వంబును పాక్షికముగ నగును.

సంశ్లేషము నకారము పరమయినహల్లుతోఁ గూడుకొనుట. స్వత్వము నకారము ఉకారేకారములతోఁ గూడియుండుట.

ఉ. పూచెన్ + కలువలు = పూచెన్గలువలు, పూచెంగవలు, పూచెఁగలువలు, పూచెనుగలువలు.

కడపటి యుదాహరణంబున స్వత్వంబువచ్చినది. అనఁగా నకారము ఎల్లప్పుడుండునట్లు అచ్చుతోఁజేరియున్నది.

84. సరళస్థిరంబులు పరంబులగునపుడు లోపంబును సంశ్లేషంబును స్వత్వంబును అగును.

ఉ. వచ్చెన్ + గోవులు = వచ్చెగోవులు, వచ్చెన్గోవులు, వచ్చెనుగోవులు. ఉఱిమెన్ + ఘనము = ఉఱిమెఘనము, ఉఱిమెన్ఘనము, ఉఱిమెనుఘనము. వచ్చెంధాత్రీపతి, పాడెంగంధర్వుఁడు - అని కొన్నిచోట్ల నకారము పూర్ణానుస్వారము అగును.

85. సమాసంబునందు ద్రుతంబునకు పరంబయిన ఉకారములోపించును.

ఉ. చిగురుంగైదువు, చిగురుఁగైదువు, చిగురున్గైదువు.
చిగురునుగైదువు అనిరాదు.

చిగురుశబ్దమునకు పరముగ షష్ఠ్యర్థక మయిన ఇన్ ప్రత్యయమువచ్చినది. ఇకారలోపము రాఁగా నకారము మిగిలినది దానికి ద్రుతకార్యము.

తలన్ + ప్రాలు=తలంబ్రాలు, తలఁబ్రాలు, తలన్బ్రాలు. తలనుబ్రాలు అనిరాదు.

ఊరన్ + పిచ్చిక = ఊరఁబిచ్చిక, ఊరంబిచ్చిక ఊరన్బిచ్చిక. ఊరనుబిచ్చిక అనిరాదు.

తలన్ ఊరన్ శబ్దములకు అంతమునందుండు అన్ సప్తమీ విభక్తి ప్రత్యయము.

అట్లె కర్మణిప్రయోగంబునందు నకారాంతమైనభావ నామంబు పూర్వపదంబయి ఉత్తరమయిన పడుధాతుజన్యక్రియలతో సమస్తమయి వచ్చుటచేత నకారమునకు స్వత్వసంధి లేదు.

ఉ. చేయన్ + పడెను = చేయన్బడెను, చేయఁబడెను, చేయఁబడెను.

86. ఉదంతమునకు పరంబుగవచ్చు ఇనాగమము పోలికచేత ఋకారాంతమునకు పరంబుగను వచ్చును.

ఉ. ధాతృ + అనుమతి = ధాతృననుమతి.

సంస్కృత పదంబులందు ఋ కారమును రు కారమువలెనే యుచ్చరించుట ఆంధ్రదేశస్థుల సంప్రదాయము. ఋ కారాంత పదములెల్లను రు కారాంతమువలె నుచ్చరింపఁబడు చున్నవి. కాఁబట్టి ఋ కారాంతములకు వెనుకను ఇనాగమము వచ్చుచున్నది.

పక్షాంతరమున; ధాతృశబ్దమునకు ఉండు ప్రత్యయము చేరఁగా ఉత్తునకు లోపము. ప్రత్యయాంతమందుండు డు కారమునకు ముందు అనుస్వారస్థానములో పూర్వముండిన నకారము రాఁగా, ధాతృన్ అనివచ్చును. రాముండు + ఆజ్ఞ = రామున్ + ఆజ్ఞ, 'రామునియాజ్ఞ'. ఇచ్చట రాముండు అను దానిస్థానములో రామున్ వచ్చినట్లు, ధాతృఁడు అను దాని స్థానములో ధాతృన్ అనివచ్చును.

87. క్రిందవచ్చు సంధులయందు వచ్చెడునకారము పూర్వపదాంతమందు అప్యర్థకమయిన ఉన్ అవ్యయముచేతను సిద్ధించునది.

ఉ. నాకొఱకు + ఇచ్చెను = నాకొఱకిచ్చెను.

నాకొఱకున్ + ఇచ్చెను = నాకొఱకునిచ్చెను.

నాకు + ఇచ్చెను = నాకిచ్చెను.

నాకున్ + ఇచ్చెను = నాకునిచ్చెను.

నాయందు + ఆదరము = నాయందాదరము

నాయందున్ + ఆదరము = నాయందునాదరము.

ఇందు + ఉన్నాఁడు = ఇందున్నాఁడు.

ఇందున్ + ఉన్నాఁడు = ఇందునున్నాఁడు.

ఎందు + అరిగెను = ఎందరిగెను.

ఎందున్ + అరిగెను = ఎందునరిగెను.

చేసెడిన్ + అతఁడు = చేసెడినతఁడు.

చేసెడున్ + అతఁడు = చేసెడునతఁడు.

చేయున్ + అతఁడు = చేయునతఁడు.

చేయున్—ఇది భవిష్యత్కాల క్రియాజన్య విశేషణము.

అఱవము శెయ్యుమ్. ఈ అఱవశబ్దము శెయ్యుందు అని మాఱును. అక్లే తెనుఁగునందు చేయున్ పదము చేసెడు అని వచ్చును. దీనికి సముచ్చయార్థకమయిన ఉన్ చేర్చి ఉన్ ప్రత్యయోకారమునకు ఇత్వమును పాక్షికముగాఁ జేయఁగా చేసెడిన్, చేసెడున్ అనురూపములు సిద్ధించును.

వర్తమానార్థక క్రియా విశేషణమునకు పాక్షికము

౫ సముచ్చయార్థకమయిన ఉన్ ప్రత్యయము చేర్పఁబడుటచేత అది పాక్షికముగా నకారాంత మగును.

ఉ. చేయుచు + ఉన్నాఁడు = చేయుచున్నాఁడు.

చేయుచున్ + ఉన్నాఁడు = చేయుచునున్నాఁడు.

88. క్రిందవచ్చు సంధులయందు పూర్వపదమునకు షష్ఠ్యర్థకమయిన ఇన్ ఉ ప్రత్యయములు చేర్పఁబడుచున్నవి.

| | | | | |
|---|---|---|---|---|
| సొగసు | + | తనము | = | సొగసున్దనము. |
| చిగురు | + | కైదువు | = | చిగురున్గయిదువు. |
| తళుకు | + | గజ్జెలు | = | తళుకున్గజ్జెలు. |
| సింగంబు | + | కోడమ | = | సింగపున్గోడమ. |
| ఉన్నతంబు | + | గొడుగు | = | ఉన్నతంపున్గొడుగు |
| గరువంబు | + | మురువు | = | గరువపున్మురువు. |
| సరసంబు | + | తనము | = | సరసపున్దనము. |

ఈ సంధులయందు షష్ఠ్యర్థకమయిన ఇన్ ప్రత్యయము పూర్వపదంబులకు వెనుకవచ్చుచున్నది. ఇన్ ప్రత్యయముయొక్క ఇకారమునకు లోపము. సింగంబు మొదలయిన అంబు ప్రత్యయాంత నామముల బకారమునకు పకారాదేశము వచ్చుచున్నది. ఇన్ ప్రత్యయముయొక్క నకారమునకు పరమయినపదముయొక్క ఆదిపరుషస్థానములో వచ్చిన ఆదేశసరళముతో సంశ్లేషము. సంశ్లేషములేనిచో అనుస్వారాదేశము. గరువపున్మురువు మొదలయినవానిలో పుకారమునకు పూర్వమయిన అనుస్వారమునకు లోపమును అగును.

సరసంబు + మాట = సరసపుమాట, సరసంపుమాట.

ఈ సంధియందు పూర్వపదముయొక్క తుదిని షష్ఠ్యర్థమైన ఉ ప్రత్యయము వచ్చుచున్నది. పూర్వపదముయొక్క పదినుండు అంబు ప్రత్యయముయొక్క బకారమునకు పకారము ఆదేశము. బకారమునకు పూర్వమయిన అనుస్వారమునకు వికల్పముగ లోపము.

ఇక్ ప్రత్యయముతోఁగూడిన సొగసు మొదలయిన పదములకు సొగసుయొక్క సొగసుకలిగిన ... అని అర్థము.

89. కర్మధారయ సమాసంబునందు ఉకారాంతంబునకు అచ్చు పరంబగునపుడు కొన్ని పదంబులందు ఇనాగమము అగును. ఇనాగమముయొక్క నకారమునకు టత్వమును ఇకారమునకు లోపమును వచ్చును.

ఉ. కఱకు + అమ్ము = కఱకుటమ్ము. పేరు + ఉరము = పేరుటురము.
నిగ్గు + అద్దము = నిగ్గుటద్దము. చిగురు + ఆకు = చిగురుటాకు.
సరసంబు + అలుక = సరసపుటలుక. పొదరు + ఇల్లు = పొదరుటిల్లు.
ఇనాగమముయొక్క ఇకారమునకు లోపము రాఁగా నకారమునకు టత్వము.

90. గుణవచనములయిన నల్లనాదులకు పరంబుగ పరుషమువచ్చునప్పుడు అకారములోపించును. నకారమునకు బింద్వాదేశంబును సంశ్లేషంబును వైకల్పికముగనగు.

ఉ. నల్లన + కాకి = నల్లంగాకి, నల్లన్గాకి.
నల్లని + తనము = నల్లందనము, నల్లన్దనము.

91. తాను నేను పదములనకారము ప్రత్యయాంత నకారముకాక పోయినను దానికి ద్రుతకార్యము కలుగును. సంశ్లేషము లేదు.

ఉ. తాను + చదివె = తానుజదివె, తాఁజదివె.
తాను + వినె = తానువినె, తావినె.

నేను + కంటిని = నేనుగంటిని, నేఁగంటిని,

నేను + వచ్చితి = నేనువచ్చితి, నేవచ్చితి.

నకారమునకు పూర్వము దీర్ఘముండుటచేత దానిచోటవచ్చిన అనుస్వారమునకు నిత్యముగ నర్థ బింద్వాదేశము వచ్చును. తాంజదివె అని రాదు.

**92.** కొన్ని సమస్త పదంబులందు అఱవమునందు వచ్చెడుసంధివిధులె అఱవ పదములనుండివచ్చిన తెనుఁగు పదముల సంధులకు మూలము.

| | అ. |
|---|---|
| ప్రాయిల్లు | పఴి ఇల్. |
| లేఁగొమ్ము | ఇళంగొమ్బు. |
| ప్రాఁగెంపు | పఴంగెంపు. |
| కెందామర | చెందామరై. |
| పూఁదోట | పూందోట్టమ్. |
| క్రొక్కారు | పుదుక్కార్. |
| క్రీఁగాలు | కీళ్ క్కాల్. |
| క్రీఁదొడ | కీళ్ త్తొడై. |

పఴం ప్రాన్, పఴి ప్రా, ఇళమ్ లేన్, కీళ్ క్రి అనియు వచ్చియున్నవి.

పుదు అనునది కుదు, క్దు, క్దొ, క్రొ అనిపరిణమించినది. వర్ణప్లుతి విధిచేతను ఉకారము దకారమునకు వెనుకకుఁబోయి ఒత్వమును బొందెను. పకార దకారములకు క్రమముగ కకార రేఫములు ఆదేశములు.

**93.** నిండు, నెఱి, నిఱు, సగము, వంక, పదములకు కొన్ని పదంబులు పరంబులగునపుడు ఆద్య వర్ణములు దప్ప మిగిలినవర్ణములకు లోపంబగు,

ఉ. నిండు + వెలి = నివ్వెలి.
నిండు + వెలుఁగు = నివ్వెలుఁగు.
నెఱి + తఱులు = నెత్తఱులు (పెద్దవళులు.)
నిఱు + పస్తు = నిప్పస్తు (శుష్కోపవాసము.)
సగము + కోరు = సంగోరు.
వంక + చెలుఁగు = వంజెలుఁగు.
సగము + పాలు = సాఁబాలు.

94. అచ్చునకామ్రేడితము పరమగునపుడు లోపము బహుళము.

ఔర + ఔర = ఔరౌర.
ఏమి + ఏమొ = ఏమేమొ, ఏమి యేమొ.

95. ఆమ్రేడితము పరంబగునపుడు విభక్తిలోపము వైకల్పికముగ నగు.

ఉ. అప్పటికిన్ + అప్పటికిన్ = అప్పటప్పటికిన్, అప్పటికప్పటికిన్.
ఇంటన్ + ఇంటన్ = ఇంటింటన్, ఇంటనింటన్.
ఊరన్ + ఊరన్ = ఊరూరన్, ఊరనూరన్.

ఇంచుక, నాఁడు మొదలగువానికి అంత్యవర్ణలోపము వైకల్పికము.

ఉ. ఇంచుక + ఇంచుక = ఇంచించుక.
నాఁడు + నాఁడు = నానాఁడు.

నాఁడు నాఁదు అని లోపంబులేనిసంధియు ఇంచు కించుక అనుసంధియుఁగలవు. దీనియందు ఇంచుకపదముయొక్క అంతాకారమునకుమాత్రము లోపము

96. శబ్దపల్లవములో పడు క్రియకుముందు కేవల ధాత్వర్థవ్యాపార కర్తృపదముయొక్క ము వర్ణమునకు లోపపూర్ణబిందువులు విభాషనగు.

ఉ. సంతోషము + పడెన్ = సంతోషపడెన్

సంతోషంపడెన్

సంతోషముపడెన్

కేవలధాతువు పడు అనునది. ధాత్వర్థ వ్యాపార కర్తయనఁగా — పడుధాతువుచేఁ జెప్పఁబడినకార్యము కలుగుట (ఉద్భవించుట). కలుగునది సంతోషము. సంతోషము కలుగుటకు ఆధారమైన దేవదత్తాదులు. సంతోషపడెను అను శబ్దపల్లవక్రియకు కర్త.

అశ్వముపడెన్. పడుక్రియకును, ధాత్వర్థమయిన పడుటకును, అశ్వము కర్తయగుటచే అశ్వపదము కేవలధాత్వర్థవ్యాపారకర్త కాదు.

97. పదాంతస్సంధియందు అనేకవిధములయిన ఆగమాదేశములు కనఁబడుచున్నవి. వానిని క్రియాప్రకరణములందును మెండుగాఁ చూడవచ్చును. వానిలోఁ గొన్నింటినిమాత్రము ఇక్కడఁ జెప్పెదను.

98. ఎఁడు, ఇంచు ప్రత్యయములు పరమగుచో పూర్వపదాంత స్వరములకు లోపము.

వీసె + ఎఁడు = వీసెఁడు.

పఠించు + ఇంచు = పఠింపించు.

99. అను నాసికములకు స్పర్శము పరమగుచో బింద్వాదేశములగును.

కొన + అగు = కొనగు = కొంగు.

వణ + అగు = వణగు = వంగు.

కనుట = కంట.

కెంపు = అ. శెమ్బు.

తంపు = అ. తణ్ + పు = తమ్బు.

100. అజాది విభక్తి ప్రత్యయములు పరమగుచో ప్రాతిపదికాంతములయిన న ర ఱ ల యలకు టకార తకారములు ఆదేశంబులగును. యకారమునకు తకారము.

| | | | |
|---|---|---|---|
| మన్ను | మంటి | మంటన్ | మంటిన్. |
| కన్ను | కంటి | కంటన్ | కంటిన్. |
| నూఱు | నూటి | నూటన్ | నూటిన్. |
| ఏఱు | ఏటి | ఏటన్ | ఏటిన్. |
| చేయి | చేతి | చేతన్ | చేతిన్. |
| వాయి | వాతి | వాతన్ | వాతిన్. |
| పల్లు | పంటి | పంటన్ | పంటి, లకారమునకు నకారాదేశము ఆదేశ నకారమునకు టత్వము. |

101. కొన్ని పదంబులలో నకారమునకు పరమయిన తకారమునకు టత్వమును, దకారమునకు డత్వమును పాక్షికముగ నగు.

అనితిని = అంటిని. వినితిని = వింటిని.

అనుతఁ = అంటఁ వినుతఁ = వింటఁ

అనుదురు అందురు అండురు.

**102.** ధాత్వంత యకారములకు తాలవ్యాచ్చు పరమగుచో సకార మాదేశమగును.

చేయు + ఎఁ = చేసెఁ చేయు + ఇ = చేసి.

**103.** ఇట్లు ఇతరమైన సంధివిధులు ఊహ్యంబులు.

---:0:---

# నా మ ప్ర క ర ణ ము.

104. నామములు ఏడువిధములు; ౧. సామాన్యనామములు.
౨. సంజ్ఞానామములు.
౩. సముదాయనామములు.
౪. ధాతుజన్యపురుషనామములు.
౫. భావనామములు.
౬. సంఖ్యానామములు.
౭. సర్వనామములు.

౧. సామాన్యనామము, ఒకజాతికిఁజేరిన వ్యక్తులను సామాన్యముగా బోధించునది; ఉ. పశువు, పక్షి, గోవు, మనుష్యుఁడు, మొదలయినది.

౨. సంజ్ఞానామము. ఒకవ్యక్తిని అనఁగా వస్తువును మాత్రము బోధించేనది. రాముఁడు, కృష్ణుఁడు, బుక్కరాయఁడు, అశోకుఁడు, కాళిదాసుఁడు.

౩. సముదాయనామము, సమూహమును బోధించునది; ఉ. బ్రాహ్మణ్యము 'బ్రాహ్మణసమూహము.' లోకము 'జనులసమూహము.' మొ.

౪. ధాతుజన్యపురుషనామము, ధాతువువలనఁ బుట్టి కాలత్రయమునుజూపుచు వాఁడువారు మొదలయిన విభక్తిప్రత్యయములను

బోందునది; ఉ. చేయువాఁడు, చేయుచున్నవాఁడు, చేసినవాఁడు. మొ.

౫. భావనామము, భావమనఁగా శుద్ధమయిన ధాత్వర్థము. దానిని బోధించునది; ఉ. వచ్చుట, తెచ్చుట, పోవుట, ఆడుట; రాక, పోక, ఆట; రామి, పేమి, పోమి, ఆడమి. మొ.

౬. సంఖ్యానామము. సంఖ్యను సంఖ్యేయమును బోధించునట్టిది. సంఖ్యేయమనఁగా సంఖ్యచేయఁదగినది; ఉ. (సంఖ్య) ఒకటి, రెండు, మూఁడు, నాల్గు. (సంఖ్యేయము) ఒకఁడు, ఇరుగురు, ముగ్గురు, నలుగురు. మొ.

౭. సర్వనామము. వాక్యమునందు నామములకు బదులుగా వచ్చునది; ఉ. వాఁడు, వీఁడు. ఎవఁడు, నేను, నీవు. మొ.

**105.** నామములు పురుషభేదమును బట్టి మూఁడు విధములు.

౧. ప్రథమపురుషము.
౨. మధ్యమపురుషము.
౩. ఉత్తమపురుషము.

సర్వనామేతరములయిన యన్నినామములును, వాఁడు వీఁడు మొదలయిన సర్వనామములును ప్రథమపురుషమనఁబడును.

౧. నీవు, మీరు. ఈవు, ఈరు మధ్యమపురుషమనఁబడును.

౨. నేను, ఏను; నేము, మేము, ఏము ఉత్తమపురుషమనఁబడును.

**106. నామములకు లింగవచనవిభక్తులుగలవు.**

| | |
|---|---|
| పుంలింగము, | పురుషవాచకము. |
| స్త్రీలింగము. | స్త్రీవాచకము. |
| నపుంసకలింగము. | మనుష్యులు, దేవతలు వీరికంటె నితరమయిన జంతువులను నిర్జీవవస్తువులను తెలుపునది. |

ఈలింగములు మూఁడువిధములఁ దెలుపఁబడును.

౧. ప్రత్యయముచేత.

| పుం. | స్త్రీ. |
|---|---|
| చిన్నవాఁడు. | చిన్నది. |
| పెద్దవాఁడు. | పెద్దది. |
| ఆటకాఁడు. | ఆటకత్తె. |
| సొగసుకాఁడు. | సొగసుకత్తె. |
| ఒకఁడు | ఒకతె. |
| బోయఁడు | బోయత. |
| బోయవాఁడు. | బోయది. |
| వ్రేఁడు. | వ్రేత. |
| బల్లిదుఁడు. | బల్లిదురాలు. |
| జెట్టిదుఁడు. | జెట్టిదురాలు. |
| రాజు. | రాణి. |
| దేవర. | దేవేరి. |

| పుం. | స్త్రీ. |
|---|---|
| పుత్రుఁడు | పుత్రి. |
| గుణవంతుఁడు. | గుణవతి, గుణవంతురాలు. |
| జ్ఞానవంతుఁడు. | జ్ఞానవతి, జ్ఞానవంతురాలు. |
| వగలాఁడు. | వగలాఁడి. |
| చెంచు. | చెంచెత. |
| చాకి | చాకిత. |
| మాతులుఁడు | మాతులాని |
| ఆచార్యుఁడు | ఆచార్యాని. |

౨. ముందొకపదముచేర్చుటచేత,

| | |
|---|---|
| మగబిడ్డ. | ఆఁడుబిడ్డ. |
| కోడెదూడ. | పెయ్యదూడ |
| కుఱ్ఱదూడ, | పడ్డదూడ. |
| పుంజుకోడి | పెట్టకోడి. |

3. వేఱువేఱుమాటలు ఉపయోగించుటచేత,

| | |
|---|---|
| తండ్రి | తల్లి. |
| తాత | అవ్వ. |
| మగఁడు. | పెండ్లము. |
| అన్న. | అక్క. |
| అల్లుఁడు | కోడలు. |
| పిత. | మాత. |
| వరుఁడు. | వధువు. |
| తమ్ముఁడు | చెల్లెలు. |
| కొడుకు. | కూఁతురు. |

| పుం. | స్త్రీ. |
| --- | --- |
| పుంజు. | పెట్ట. |
| ఎద్దు | ఆవు. |
| పోతు. | పెంటి. |
| గోడా. | గోడిగ. |

వచనములు రెండు.—౧ ఏకవచనము.
౨ బహువచనము.

ఏకవచనము=ఒకవస్తువును బోధించునది; ఉ. రాముఁడు, కృష్ణుఁడు, వనము, ధనము, లత, నది, తరువు, మొ.

బహువచనము.=ఒకటికి అధికమయిన సంఖ్య గలిగిన వస్తువులను బోధించునది; ఉ. రాములు, కృష్ణులు, వనములు, ధనములు, లతలు, నదులు, తరువులు, మొ.

**107.** నామములకును ఇతరనామములకును, నామములకును ఆఖ్యాతములకును, అర్థమందుఁగలుగు సంబంధములను దెలుపునట్టి రూపభేదములు విభక్తులనఁబడును. ఈవిభక్తులు ప్రత్యయములచేఁ దెలుపఁబడును.

విభక్తిప్రత్యయములు:—

అండు, అఁడు, ఉండు, ఉఁడు, అది, ది, అము, అమ్ము, అంబు మొదలయినవి—ప్రథమైక వచనంబునందగు.

అలు, ఉలు, లు, అరు, ఉరు, రు, అవి, వి మొదలయినవి—ప్రథమా బహువచనంబునందగును.

అన్, ఇన్, ఉన్, గుఱించి. కూర్చి—ద్వితీయ.

అన్, చేతన్, చేన్, తోడన్, తోన్, చేసి—తృతీయ.

కి, కు, కయి. కొఱకు—చతుర్థి.

కంటెన్, వలనన్. పట్టి, ఉండి. తొట్టి, లెన్, చేసి—పంచమి.

కి, కు, అ, ఇ. ఉ, అన్. ఇన్—షష్ఠి.

అన్, ఇన్, ఉన్, అందు, లోన్, లోపలన్—సప్తమి.

**108.** వీనిలోఁ గొన్ని శుద్ధప్రత్యయములు. ఇతరములు పదములు. ప్రత్యయములకు పూర్వమయినస్వరమే యంతము నందు ఉచ్చారణార్థముగా వచ్చును. అకారాది ప్రత్యయమునకు ఎకారాది ప్రత్యయమునకును అంతమునందు ఉకారము వచ్చును. వీనికి నుదాహరణములం గ్రిందఁజూడుము.

శుద్ధ విభక్తిప్రత్యయములకు ఉదాహరణములు.

| | | |
|---|---|---|
| ద్వి. | అన్ | లతనుజూచెను. |
| | ఇన్ | హరినిజూచెను. |
| | ఉన్ | శంభువునువేఁడెను. |
| తృ. | అన్ | పంటనుగొఱికెను. |
| చ. | కి | హరికివందనము. |
| | కు | శంభునకుమంగళము. |
| ష. | ఇ | రామునియాజ్ఞ, గురునియుపదేశము. |
| | అ | మనపుస్తకము, పాఁపఁడేఁడు, ఇనుపదారి. |
| | ఉ | దేశంపుజనులు |
| స. | అన్ | ఇంటనున్నాఁడు. |
| | ఇన్ | మదినిదలఁచెను. |

**109.** విభక్తిప్రతిరూపకములు పదాంతమునందు వచ్చి విభక్త్యర్థములనిచ్చు నామ క్రియాపదములు.

చేతన్, చేన్, తోడన్, తోన్, కొఱకు, వలనన్, కంటెన్, లోన్, లోపలన్—ఇవి విభక్త్యంతములైన నామములు.

పట్టి, ఉండి, తొట్టి, చేసి, కూర్చి, గుఱించి—క్త్వార్థకక్రియలు ఇవి పూర్వపదములతోఁజేరి విభక్త్యర్థములనిచ్చును.

కి. కు. కయి. కయియందు కి కు లకు అయి చేర్పఁబడియున్నది. అయి అగుధాతు క్త్వార్థకము.

చేతన్ మొదలయినవి షష్ఠ్యంతమయిన నామములతోఁ గూడి తృతీయాద్యర్థముల నిచ్చును.

ఉ. రామునిచేతన్ = చేయి + అన్. చేతన్ = 'హస్తమునందు' అనఁగా హస్తమును సాధనముగాఁజేసికొని అనియర్థము.

తోడన్ = తోడు + అన్. తోడన్ = 'సహవాసమునందు'. తోడు. 'సహవాసము' 'సంగము' 'చేరిక'. రాముని తోడన్ 'రామునియొక్క సహవాసమునందు' అనియర్థము.

కొఱకు = కొఱ + కు. కొఱ 'ప్రయోజనము', రామునికొఱకు 'రామునియొక్క ప్రయోజనమునకు' అనియర్థము.

వలనన్ = వలను + అన్. వలను 'పక్షము' 'పార్శ్వము' వలనన్ 'పార్శ్వమునందు'.

ఉ. రామునివలనన్ = 'రామునియొక్క పార్శ్వమందు' అనఁగా రాముఁడు హేతువుకాఁగానని యర్థము.

కోలెన్=కొలెన్=కొనన్. తుమున్నంతావ్యయము. 'కొనఁగా' అనియర్థము.

ఉ. నాటన్ గోలెన్=నాటన్+కోలెన్. నాటన్ 'నాటియందు' కోలెన్ 'కొని' 'ఆదినమందుకొని' అనఁగా 'ఆదినము మొదలుకొని' అనియర్థము. కొనన్ పదముయొక్క నకారమునకు లత్వము. అకారమునకు ఎత్వము.

లోన్=లో+అన్. అ. ఉళ్లాల్. ఉళ్-లో, అల్-చేతన్

ఉ. ఇంటిలోన్ 'ఇంటియొక్క-లోభాగమునందు'.

లోపలన్=లోపలు+అన్.

ఉ. ఇంటిలోపలన్='ఇంటియొక్క-లోభాగమునందు'.

పట్టి=పట్టు+ఇ. క్త్వార్థకము ఇప్రత్యయము. పట్టి 'గ్రహించి'.

ఉ. చేయుటంబట్టి=చేయుటను+పట్టి. 'చేయుటవలన'.

ఉ. ఉండి=ఉండు+ఇ. 'నిలిచి'.

పర్వతమునుండి 'పర్వతమునందుండి' 'పర్వతమునువిడిచి'

ఉ. తొట్టి=తొట్టు+ఇ. 'ఆరంభించి' తొట్టు 'స్పృశించు' 'ఆరంభించు'.

'వనకేళీకౌతుకమునఁజనియెను శర్మిష్ఠఁదొట్టి సఖులెల్ల ముదంబునఁ గొలిచిరాఁగ'. భార. ఆ.—శర్మిష్ఠఁదొట్టి 'శర్మిష్ఠను మొదలుగాఁగొని' అనియర్థము.

ఉ. చేసి=చేయు+ఇ. చేయుధాతువుయొక్క క్త్వార్థకరూపము.

వచ్చుటంజేసి 'వచ్చుటను కారణముగాఁజేసి' 'వచ్చుటచేతన్' అనియర్థము.

కూర్చి, గుఱిచి, అ. కుఱి 'గురుతుచేయు' అనుధాతువు వలనఁ బుట్టిన తె. గుఱుచు అనుధాతువునకు క్త్వార్థకరూపము.

కి - కు - ప్రత్యయములు ప్రయోగమునందు విభక్తి ప్రతిరూపకశబ్ద తుల్యంబులు కాఁబట్టి విభక్తి ప్రాతిపదికములతోఁ జేర్పఁబడును.

ఈ కికు ప్రత్యయములమూలరూపము పూర్ణశబ్దముగానుండవలయు. అది చింత్యము.

ఉ. రామునికి, కృష్ణునికి, శంభునకు—రామునికయి, కృష్ణునికయి, శంభునకయి. అ. రామనుకాఁయి. క. రామనిగాగి.

యొక్క- అ. ఉడయ ఇదిమాత్రము నామవిశేషణము.

ఉ. రామునియొక్క. అ. రామనుడైయ.

విభక్తిప్రత్యయములు.

110. ఉండు. ఉఁడు ప్రత్యయములు తత్సమదేశ్య పదంబులకు వచ్చును.

ఉ. (తత్స.) కృష్ణుండు, కృష్ణుఁడు, గోవిందుండు, గోవిందుఁడు. దామోదరుండు, దామోదరుఁడు, శివుండు, శివుఁడు,

(తద్భ. దే.) అక్కజుండు, అక్కజుఁడు, కందుండు, కందుఁడు, కొమరుండు, కొమరుఁడు, చందురుండు, చందురుఁడు, జముండు, జముఁడు, మొక్కలుండు, మొక్కలుఁడు; కావలుండు, కావలుఁడు. బెట్టిదుండు, బెట్టిదుఁడు, బెడిదుండు, బెడిదుఁడు.

బెట్టిదుండు=బెట్టి+ఉండు. (బెట్టు=ఉద్ధతి.) బెట్టియుండు - బెట్టిదుండు. యాకు దాదేశము.

బెడిదుండు=బెడి+ఉండు. (బెడి=బెడిదము=క్రౌర్యము) దీనియందును యాకు దాదేశము.

వీనిలోఁ గొన్నింటికి స్త్రీలింగమునందు ఆలు ప్రత్యయమును నపుంసకలింగమునందు అము ప్రత్యయమును జేర్పఁబడును.

బల్లిదము, బల్లిదురాలు, కొమరురాలు.

**111.** అండు, అఁడు ప్రత్యయములు తద్భవదేశ్యములందు మాత్రము వచ్చును.

| | | |
|---|---|---|
| ఉ. | గండఁడు. | క. గండను. |
| | మిండఁడు. | ,, మిండను. |
| | మగఁడు. | అ. మగన్. |
| | మనమఁడు. | ,, మఱుమగన్. |
| | రాయఁడు. | సం. రాజ. |
| | పాపఁడు. | |
| | బాపఁడు. | అ. పార్పాన్. సం. బ్రాహ్మణ. |
| | ముదుకఁడు. | ముదువన్. |
| | ప్రేఁడు. | సం. పల్లవ. అ. పల్లవన్. |
| | కయిరఁడు = | 'ఒకజాతిగుఱ్ఱము' |
| | కత్తళఁడు = | 'తెల్లనిగొరిజ తోఁక నెంౘ్రుకలు గలనల్లని గుఱ్ఱము'=కత్తలాని. సం. కర్త్తలాణః |
| | జన్నఁడు = | 'ఒకజాతిగుఱ్ఱము'. |
| | నీలఁడు = | 'నీలవర్ణముగలగుఱ్ఱము'. |
| | పులియఁడు= | 'పులివలెశౌర్యముగలకుక్క' |

కయిరఁడు మొదలయినవి పుంలింగప్రత్యయాంతములయినను నపుంసకలింగమందుఁ బ్రయుక్తము లగును.

**112.** పగతుఁడు మార్తుఁడు విల్తుఁడు ఈశబ్దములలో ప్రత్యయవకారమునకు తాదేశము.

ఉ. పగరుఁడు = పగవుఁడు. అ. పగైవన్, 'శత్రువు'; పగై, తె. పగ, 'ద్వేషము'
(గట్టు), విల్తుఁడు=విల్లవుఁడు. అ. విల్లవన్. విల్, తె. విల్లు.
మార్తుఁడు. అ. మాఱువాన్, మాఱు 'వేఱయి యుండుట'

**113. కొన్ని పదంబులందు అండు, ఉండు ప్రత్యయముల యొక్క ఆద్యములయిన అచ్చులకు లోపము అగును.**

కల్లరీఁడు = కల్లరి+వాఁడు=కల్లరియఁడు = కల్లరీఁడు. కల్లరి 'అసత్యము పలుకువాఁడు'. ఈశబ్దమునకు వాఁడు ప్రత్యయముచేరఁగా కల్లరివాఁడు అనినిలుచును. ఆ కారమునకు హ్రస్వాదేశమురాఁగా కల్లరివఁడు అని యగును. వర్ణసమీకరణవిధిచే వకారమునకు యకారాదేశము వచ్చెను. ఇకార యకారములకు ఈకారాదేశము రాఁగా కల్లరీఁడు అని సిద్ధించెను.

మొక్కలీఁడు = మొక్కలి+వాఁడు; మొక్కలి=ముష్కరుఁడు.

అటమటీఁడు=అటమట+వాఁడు, 'అటమట కలిగినవాఁడు;' అటమట=వంచన. అటమటశబ్దము యొక్క తుదియకారము ఇకారము కాఁగా, వాఁడు ప్రత్యయము యొక్క ఆకారమునకు హ్రస్వమును, వకారమునకు యకారాదేశమును, ఇకార యకారములకును ఈయాదేశమును పూర్వమువలె వచ్చినవి.

కమ్మతీఁడు =కమ్మతము+వాఁడు.ములోపము. మిగిలినవి పూర్వమువలె.

కొండీఁడు = కొండెము+వాఁడు. ములోపము. కొండెవాఁడు. ఎకారమునకు ఇత్వము. మిగిలినవి పూర్వమువలె.

ఎకిమీఁడు = యజమానుండు = ఎకిమానుండు = ఎకిమాండు = ఎకి
మీఁడు. యకారమునకు ఎత్వము. జకారమునకు
కిత్వము. నులోపము. ఆకారమున కీత్వము.

అట్టిఁడు = అట్టి + వాఁడు. "ఈవసుధాధినాథులజయించినయట్టిఁ
డ." భార. ఆది.

ఇట్టిఁడు = ఇట్టి + వాఁడు. "ఎఱుఁగమె మేవురమతం డిట్టిఁడగుట."
భార. శా.

ఎట్టిఁడు = ఎట్టి + వాఁడు. "ఎట్టిఁడునాని జేశుఁడు." రా. సు.

ఏఁడు = అ. ఇతైవక్.

ఇతైవఁడు. వక్ ప్రత్యయము వకారమునకు యత్వ
మయినది.

ఇతైయఁడు = ఏయఁడు = ఏఁడు.

**114.** వృద్ధాదులకు ఉండు ప్రత్యయాంతరూపమును ఉ
కారాంతరూపమును గలవు.

| | | | | |
|---|---|---|---|---|
| వృద్ధుండు | మూర్ఖుండు | చార్వాకుండు | నీచుండు | గృహస్థుండు. |
| వృద్ధు | మూర్ఖు | చార్వాకు | నీచు | గృహస్థు. |

వృద్ధు అని ఉకారాంతరూపమునకుఁగారణము—వృద్ధర్
గళ్ అను అఱవబహువచనము సంశ్లేషముచే వృద్ధు
లుఅనిరూపమునుపొందెను. ఈ ఈసంశ్లేష రూపము
నందు ఉలు అనుభాగము బహువచనప్రత్యయముగా
గ్రహింపఁబడుటచే వృద్ధు అనురూపము ఏకవచనము
నందు సిద్ధించెను. అఱవములో వృద్ధర్గళ్ అను బహు
వచనరూపము వృద్ధాళ్ అని గ్రామ్యభాషయందయి
తెనుంగునందు వృద్ధులు అను రూపమువచ్చెను.

**115.** అసురశబ్దమునకు అసురుఁడు అసుర అని రెండు రూపములుగలవు.

అ. అసురర్గళ్ అసురాళ్ అనిమాఱును. అసురాళ్ తెనుఁగున అసురలు అయ్యెను. అసురలుశబ్దమును అసుర + అలు అని విభజింపఁగా, అసురశబ్దము ఏకవచనమునకు సిద్ధించె.

**116.** అట్లె దూతాదిశబ్దములకు అకారాంత రూపము పాక్షికముగఁ గలుగును.

దూతుండు, దూత; యోధుండు, యోధ; ఖుంతుండు, ఖుంత.

**117.** మహద్వాచకములయిన ఉకారాంతశబ్దములకు ఉ ప్రత్యయము బహుళముగ నగు. దానికిని ప్రాతిపదికాంత్యో కారమునకును నడుమ వకారాగమంబగును.

ఉ. విష్ణువు = విష్ణు + వ్ + ఉ. పక్షమున విష్ణుఁడు.
శంభువు = శంభు + వ్ + ఉ. పక్షమున శంభుఁడు.
వసువు = వసు + వ్ + ఉ. పక్షమున వసుఁడు.

అమహద్వాచకములకు ఉ ప్రత్యయము నిత్యముగానగు.

ఉ. తరువు = తరు + వ్ + ఉ.
మధువు = మధు + వ్ + ఉ.
ధేనువు = ధేను + వ్ + ఉ.
గోవు = గో + వ్ + ఉ.

ఉ ప్రత్యయము నపుంసకలింగములకు నిత్యమగుటం జేసి తరువు మొదలయినవానికి వేఱురూపములు లేవు.

**118.** కద్రూశబ్దమునకు అప్రత్యయమును అంతోకారమునకు హ్రస్వమును అగును.

ఉ. కద్రువ=కద్రూ+వ్+అ. కద్రువ 'నాగమాత'

**119.** ఋకారాంతంబులందు సామాన్యముగా సంస్కృత ప్రథమైకవచనముయొక్క ఆకారమునకు హ్రస్వాదేశము చేయుటచేతనును, విధాత్రాదిశబ్దములందు పాక్షికముగా ప్రాతిపదికమునకు ఉండు ప్రత్యయము చేర్చి ఉలోపము చేయుటచేతనును ప్రథమైకవచనములు సిద్ధించును.

| | | |
|---|---|---|
| ఉ. భ్రాత | సం. | భ్రాతా. |
| జామాత | ,, | జామాతా. |
| కర్త | ,, | కర్తా. |
| భర్త | ,, | భర్తా. |
| హర్త | ,, | హర్తా. |
| పిత | ,, | పితా. |
| మాత | ,, | మాతా. |
| విధాత. / విధాతృఁడు | ,, | విధాతా. |
| ధాత. / ధాతృఁడు | ,, | ధాతా. |
| దాత / దాతృఁడు. | ,, | దాతా. |
| సవిత / సవితృఁడు. | ,, | సవితా |
| నేత / నేతృఁడు. | ,, | నేతా |

120. దీర్ఘాంతశబ్దంబుల యంతస్వరంబునకు హ్రస్వంబగు.

ఉ. రమ రమా.
వనిత వనితా.
లక్ష్మి లక్ష్మీ.
గౌరి గౌరీ.

ఏకాక్షరంబునకు హ్రస్వంబురాదు.

ఉ. క్ష్మా, భా, శ్రీ, స్త్రీ, హ్రీ, ధీ.

అపవాదము; భ్రూ, గోశబ్దములకు ఉప్రత్యయంబగును.

ఉ. భ్రూవు = భ్రూ+వ్+ఉ. గోవు=గో+వ్+ఉ.

121. భూ నౌ శబ్దములకు ఇప్రత్యయమును ఊకారమునకు హ్రస్వమును ఔకారమునకు ఆవాదేశమును అగును.

ఉ. భువి. = భూ+వ్+ఇ.
నావి, నావ్ + ఇ; నావయనియుఁ గలదు.

122. కంధరాది శబ్దములకు అము ప్రత్యయంబు పాక్షికంబుగనగు.

ఉ. కంధరము, నాసికము, భిక్షము, దంష్ట్రము, గ్రీవము, ఉల్కము. అముప్రత్యయంబు లేనిపక్షమున—కంధర, నాసిక, భిక్ష, దంష్ట్ర, గ్రీవ, ఉల్క అను రూపములు సిద్ధించును.

123. చరిత్రాదుల అముప్రత్యయముయొక్క ముకారమునకు పాక్షికముగ లోపంబగు.

ఉ. చరిత్రము—చరిత్ర, అలకము—అలక, మొ. చరిత్రము, అలకము, అభిలాషము, అక్షరము.

ఘోషము, తరంగము, భ్రమము, విజృంభణము, వధము, వేగము, స్ఫురణము, హంసము.

చరిత్రములు చరిత్రాలు అనివచ్చి చరిత్రలు అనికాఁగా, అలుప్రత్యయము బహువచన ప్రత్యయముగా గ్రహించిన యెడల చరిత్ర అని ఏకవచనమునకు వచ్చును.

పక్షాంతరము;

కన్నడమున జ్ఞానము అనుపదము మకారమునకు వకారాదేశము వచ్చుటచే జ్ఞానవు అనిమాఱును. పాక్షికముగ వుకారములోపించిన జ్ఞాన అనియు వచ్చును. అట్లే తెనుంగునను చరిత్రాదులకు ములోపము వచ్చును.

124. హలంతమునకు సామాన్యముగ మూఁడులింగములలోను ఉప్రత్యయము వచ్చును. ప్రత్యయ పూర్వమయిన హల్లునకు ద్విత్వంబు అగును.

ఉ. మరుత్తు, దిక్కు, కకుప్పు, రాట్టు, వాక్కు.

125. దీర్ఘమునకు పరమయిన హలునకు ద్విత్వంబు బహుళంబుగనగు.

ఉ. వాక్కు, వాకు; రాట్టు స్వరాట్టు, స్వరాటు,

126. మద్వద్వసంతములు (మత్ వత్ వస్ అంతములు) అయినవానికి తఱుచుగ సంస్కృతమునందు ప్రథమాద్వివచనాదులయందు వచ్చురూపములలో నొకటి ప్రాతిపదిక మగు, ఉండు. ఉఁడు ప్రత్యయములును ఆ ప్రాతిపదికముల కగు.

| | | | |
|---|---|---|---|
| ఉ. | శ్రీమత్ | శ్రీమంత్ | శ్రీమంతుఁడు. |
| | గుణవత్ | గుణవంత్ | గుణవంతుఁడు. |
| | హనుమత్ | హనుమంత్ | హనుమంతుఁడు. |
| | విద్వస్ | విద్వాంస్ | విద్వాంసుఁడు |
| | భగవత్ | భగవంత్ | భగవంతుఁడు. |

హనుమత్, భగవత్ శబ్దములకు హనుమానుండు హనుమఁడు, హనుమ భగవానుండు అనియు రూపములు గలవు.

పైఁజెప్పిన పదములలో స్త్రీలింగమునందు అంతముగా వచ్చెడి ఈకారమునకు తెనుంగునందు హ్రస్వమగును.

| | | |
|---|---|---|
| శ్రీమతి | శ్రీమతీ | శ్రీమత్. |
| గుణవతి | గుణవతీ | గుణవత్. |
| విదుషి | విదుషీ | విద్వత్. |

వీనికి శ్రీమంతురాలు, గుణవంతురాలు, విద్వాంసురాలు అనియు రూపములు వచ్చును.

**127. ముదాదులకు అము ప్రత్యయము వచ్చును.**

| | | | |
|---|---|---|---|
| ఉ. | ముదము | = ముద్ | + అము. |
| | ఉపానహము | = ఉపానహ్ | + అము. |
| | స్రజము | = స్రజ్ | + అము. |
| | నీవృతము | = నీవృత్ | + అము. |

వెనుకటి రెంటికిని స్రక్కు, నీవృత్తు అని సామాన్యరూపమును గలదు.

**128. నాంత పుంవాచక నామముయొక్క ప్రథమైకవచనమునందు అంత్యాచ్చునకు హ్రస్వమగు.**

| | | |
|---|---|---|
| ఉ. విశ్వకర్మ | విశ్వకర్మా | |
| కృష్ణవర్త్మ | కృష్ణవర్త్మా. | 'అగ్ని' |
| అశ్వత్థామ | అశ్వత్థామా. | |
| యువ | యువా. | 'యౌవనము గలిగినవాఁడు.' |
| యజ్వ | యజ్వా. | 'యజమానుఁడు.' |
| దేవశర్మ | దేవశర్మా. | |
| బ్రహ్మ | బ్రహ్మా. | 'బ్రహ్మదేవుఁడు,' 'బ్రాహ్మణుఁడు,' 'ఋత్విక్కు.' |

దేవశర్ముండు అని నకారాంత మనుష్యనామమునకు వచ్చును.

**129.** ఇమనిచ్ప్రత్యయాంత శబ్దమునకు అంతనకారము లుప్తమగును. లుప్త నకారరూపమునకు అము ప్రత్యయము పాక్షికముగ నగు.

| | |
|---|---|
| ఉ. మహిమ | మహిమము. |
| అణిమ | అణిమము. |
| గరిమ | గరిమము. |
| లఘిమ | లఘిమము. |
| ప్రథిమ | ప్రథిమము. |
| ప్రేమ | ప్రేమము. |

**130.** నాంత నపుంసకశబ్దముయొక్క ప్రథమైకవచనమునకు తెనుంగున అముప్రత్యయము అగును.

| | | | |
|---|---|---|---|
| ఉ. కర్మము | కర్మ. | వర్మము | వర్మ. |
| శర్మము | శర్మ. | మర్మము | మర్మ. |
| చర్మము | చర్మ. | పర్వము | పర్వ. |
| బ్రహ్మము | బ్రహ్మ 'వేదము' 'తత్త్వము' 'తపస్సు.' | | |

131. ఆత్మన్ శబ్దమునకు ఆత్మము, ఆత్మ, ఆత్ముండు అని మూడురూపములు వచ్చును.

132. జగత్ ఇంద్రజిత్ శబ్దములకు తకారలోపము పాక్షికంబుగ నగు.

లుప్తతకారమయిన జగత్ శబ్దమునకు అముప్రత్యయము వచ్చును.

ఉ. జగము జగత్తు.

ఇంద్రజి ఇంద్రజిత్తు ఇంద్రజిత్తుండు అని
[illegible]

133. పుంలింగమయిన రాజన్ శబ్దముయొక్క అంతమునకు ఉకారాదేశం బగు.

ఉ. రాజు, మహారాజు, ఖగరాజు.

నపుంసకలింగమగుచో నకారలోపమును అముప్రత్యయమును అగును.

రాజము, పర్వతరాజము, వృక్షరాజము.

134. సకారాంతములయొక్క అంత సకారమునకు లోపంబు బహుళంబుగానగు. సలోపముకాఁగా మనసు మొదలగు వానికి అముప్రత్యయమును ధన్వాదులకు ఉప్రత్యయమును వచ్చును. అర్చి మొదలైనవానికి నారెండునురావు. సలోపము లేనిపక్షమున మనస్ మొదలయిన వానికి అంత సకారమునకు ద్విత్వము వికల్పంబుగ నగును.

ఉ. ఉరము ఉరస్సు.

వక్షము వక్షస్సు.

| | | |
|---|---|---|
| అర్చి రోచి | | అర్చిస్సు. |
| ధనువు | | ధనుస్సు. |
| ఆయువు | | ఆయుస్సు. |
| మనము | మనస్సు | మనసు. |
| శిరము | శిరస్సు | శిరసు. |
| సదము | సదస్సు | సదసు. |
| సరము | సరస్సు | సరసు. |

పయస్ వయస్ శబ్దములకు సలోపంబు కలుగదు. పయంబు అనియుఁగలదని కొందఱు చెప్పుచున్నారు. ప్రయోగములు ఉండినయెడల గ్రాహ్యము.

**135.** కొండొక పుల్లింగసాంతశబ్దంబుల అంత సకారమునకు లోపము విభాషనగును. లోపమయిననుగాకున్నను ఉండు ప్రత్యయము నిత్యముగ నగు.

| | | |
|---|---|---|
| ఉ. అంగిరుండు | అంగిరసుండు | అంగిరస్ |
| ప్రచేతుండు | ప్రచేతసుండు | ప్రచేతస్ |
| ఉగ్రశ్రవుండు | ఉగ్రశ్రవసుండు | ఉగ్రశ్రవస్. |
| ఊర్ధ్వరేతుండు | ఊర్ధ్వరేతసుండు | ఉర్ధ్వరేతస్. |
| విష్టరశ్రవుండు | విష్టరశ్రవసుండు | విష్టరశ్రవస్ |

**136.** వేధః పురోధశ్శబ్దములకు సలోపమును పురోధశ్శబ్దమున సలోపములేనిపక్షమున ఉండుప్రత్యయమును అగును.

ఉ. వేధ వేధస్ 'బ్రహ్మ'

పురోధ పురోధసుఁడు 'పురోహితుఁడు'.

137. ద్యుహృచ్ఛబ్దములకు దివి హృదియగు.

ఉ. దివి ద్యుస్ 'స్వర్గము,' 'ఆకాశము'
హృది హృత్ 'మనస్సు'

138. కలన్వాదులకు ఏకవచనమునందు కుప్రత్యయంబు స్వార్థంబునందు వికల్పముగనగు. *

ఉ. కలను, కలంకు, కలఁకు;
కలను, కెలను, కొఱను, కొలను, గవను, నెఱను, మ్రాను, వరను, వలను, ఇవి కలన్వాదులు.

(వీనిబహువచనములను చూడుము.)

139. రేన్వాదులకు గు ప్రత్యయంబు వైకల్పికంబు.

ఉ. రేను, రేఁగు; గోను, గోఁగు.

140. ఏకవచనమునందు అడుగ్వాదులకు గుప్రత్యయమును నిప్పుకాదులకు కప్రత్యయమును వెలఁగాదులకు గప్రత్యయమును నిత్యముగను అగును.

ఉ. అడుగు = అ. అడి + గు. అడి శబ్దముయొక్క తుది ఇకారమునకు వర్ణసమీకరణ విధిచే ఉత్వము.
మడుగు = అ. మడి + గు. ఇదియు పైయట్లగు.
కొంగు = అ. కొనై + గు = కొన్ + గు. ఐకారలోపము; నకారమునకు అనుస్వారాదేశము.

* క్రియాప్రకరణములో ౧౬-వ పుట చూడుము.

ఏనుఁగు అ. యానై + గు. ఇచ్చటనర్థానుస్వారమున కు కారణము లేదు.

పీనుఁగు ,, పిణమ్ + గు.

నిప్పుక నిప్పు. అ. నెరుప్పు.

ఎమ్ముక ఎమ్ము. అ. ఎలుంబు.

చిలుక అ. కిళి.

ఎలుక ,, ఎలి.

మంచుక మంచు.

వెలఁగ అ. విళ.

గానుఁగ ,, కాణమ్.

ప్రథమా బహువచనములు.

**141.** అరు, రు ప్రత్యయములు వారు, వీరు, మీరు, ఎవరు, దాసరి, దేవర శబ్దంబులందు వచ్చును.

దాసరిశబ్దంబున ఇకారమును దేవరశబ్దంబున అకారమును అంత ప్రత్యయములుగా వచ్చెను, అయినను అవిస్వరూపప్రత్యయములు గావు.

ఉ. అ. దాసరవర్ = దాసరివారు.

దేవరవర్ = దేవరవారు.

అంతమందు వారు ప్రత్యయము లుప్తముకాఁగా దేవర దాసరి శబ్దంబులు సిద్ధంబులయ్యె. ఇట్లేయేకవచనమున దాసన్ శబ్దమువలన సాతనిశబ్దము వచ్చెను.

(క్రియా. ౧౦-వ పుట-చూ.)

దేవేరి— ఇది దేవరశబ్దమునకు స్త్రీలింగమున వచ్చురూపము.

**142.** అకారాంతంబులకు అలుప్రత్యయము.

ఉ. లతలు, రమలు, కద్రువలు, పితలు.

అఱవములో సురర్‌గళ్ అనునది సురాళ్ అని మాఱి సురలు అని తెనుంగున వచ్చినట్లు, లతైగళ్-లతాళ్-లతలు అని వచ్చెను.

**143.** ఇతరశబ్దములకు ఉలుప్రత్యయంబు.

ఉ. రాములు, వృద్ధులు, బల్లిదులు, హరులు, మనువులు, వనములు, రాజులు, రాసులు.

రామర్‌గళ్, రామాళ్-రామలు అని వికారమును బొంది వర్ణసమీకరణవిధిచే లకారమునకు పూర్వమయిన అకారమునకు ఉత్వము రాఁగా రాములు.

**144.** ఆకారపూర్వక లకారాంతశబ్దములకు ఉలుప్రత్యయము చేర్పఁగా పదాంత లకారమునకు రేఫాదేశము.

ఉ. బాలురు = బాల + ఉరు. లకారమునకు రేఫాదేశము వర్ణవిభేదన విధిచేత వచ్చుచున్నది. 52వ-విధి చూడుము.

**145.** పగతుండు, అల్లుండు, నెయ్యుండు, బలియుండు ఈ శబ్దములకును బహువచనమునందు ఉరుప్రత్యయము చేర్పఁబడును.

ఉ. పగతురు, బలియురు, అల్లురు, నెయ్యురు.

పగశబ్దమునకు వరుప్రత్యయము రాఁగా పగవరు అని వచ్చును. అ. పగైవర్ రేఫమునకు పూర్వమయిన

అకారమునకు వర్ణసమీపకరణ విధిచే ఉత్వము. వ
కారమునకు తత్త్వము.

146. అందు ప్రత్యయాంత శబ్దములకు బహువచన
మందు రుప్రత్యయ మగును.

ఉ. గండండు—గండంౢడు, మిండండు—మిండంౢడు.

అ. గండఁడు—గండరు. అనియుండఁగాఁ దెనుంగున—
గండఁడు—గండరు అని అరుప్రత్యయముతో రా
వలయు. అఱవమునందువలె తెనుంగునందును అరు
అను బహువచన ప్రత్యయమును గండశబ్దమునకుఁ
జేర్పవలయునే కాని గండఁడు అను ఏకవచన రూప
మునకు జేర్చుట అశాస్త్రీయము. అట్లుచేయుట
వాడుకను బట్టియే. కన్నడమునందు గండందిరు అను
బహువచనమును చూడుము.

147. కాఁడు, గాఁడు ప్రత్యయాంత శబ్దములకు బహువ
చనమందు వికల్పముగ రుప్రత్యయమగు. రు ప్రత్యయము రా
నియెడ ఉలు ప్రత్యయమును, ఉలు ప్రత్యయముయొక్క ఆద్యో
కారమునకు లోపమును, రలలకు ఱత్వమునగు.

| | |
|---|---|
| ఉ. విలుకాఁడు | విలుకాంౢడు. |
| వేఁడుకకాఁడు | వేఁడుకకాంౢడు. |
| వేఁటకాఁడు | వేఁటకాంౢడు. |
| చెలికాఁడు | చెలికాంౢడు. |
| అందగాఁడు | అందగాంౢడు. |
| బేరగాఁడు | బేరగాంౢడు. |
| విలుకారులు | విలుకాఱు. |

వేఁటకారులు వేఁటకాఱు.
వేఁడుకకారులు వేఁడుకకాఱు.

148. తేఁడుప్రభృతులకు బహువచనమున ఉలుప్రత్యయము. ప్రత్యయాద్యుకారమునకు పాక్షికముగ లోపము.

ఉ. తేఁడులు, తేండ్లు. కమ్మతీఁడులు-కమ్మతీండ్లు.
ఎకిమీఁడులు, ఎకిమీండ్లు. కల్లరీఁడులు కల్లరీండ్లు.
అటమటీఁడులు, అటమటీండ్లు.

149. అట్టిఁడ్వాదులకు బహువచనమందు ండు లోపమును రు ప్రత్యయమును అగును.

ఉ. అట్టిఁడు—అట్టిరు, ఇట్టిఁడు—ఇట్టిరు, ఎట్టిఁడు—ఎట్టిరు.
అట్టివాఁడు అట్టిఁడు అని వచ్చినట్లు అట్టివారు అట్టిరు అని వచ్చినది.

150. కలన్వాదుల బహువచనము నందు కులు ప్రత్యయమును రేన్వాదులకు గులు ప్రత్యయమును గాన్వాదులకు గలు ప్రత్యయమును నిత్యముగను అగును.

ఉ. కలను కలంకులు అ. కలంగళ్
కెలను కెలంకులు.
కొఱను కొఱంకులు.
కొలను కొలంకులు. అ. కుళంగళ్
గవను గవంకులు.
నెఱను నెఱంకులు. అ. నిఱంగళ్, నిఱమ్.
'వక్షస్థ్సలము.'
మ్రాను మ్రాఁకులు. అ. మరంగళ్

వీనియందు కులుప్రత్యయము.

| | | | |
|---|---|---|---|
| రేను | రేఁగులు. | | |
| గోను | గోఁగులు. | | |
| ఏనుఁగు | ఏనుఁగులు. | అ. | య్యానైగళ్. |
| పీనుఁగు | పీనుఁగులు. | ,, | పిణంగళ్. |
| అడుగు | అడుగులు. | ,, | అడిగళ్. |
| మడుగు | మడుగులు. | ,, | మడిగళ్. |
| కొంగు | కొంగులు. | ,, | కునెగళ్. |

ఈపదములయందు గులుప్రత్యయము.

| | | | |
|---|---|---|---|
| ఎముక | ఎముకలు | అ. | ఎన్బుగళ్. |
| ఎమ్ముక | ఎమ్ముకలు | | |
| ఎలుక | ఎలుకలు. | ,, | ఎలిగళ్. |
| చిలుక | చిలుకలు | ,, | కిళిగళ్. |
| మడక | మడకలు | ,, | మడిగళ్. |
| నిప్పుక | నిప్పుకలు | ,, | నెఱుప్పుగళ్. |

ఈపదంబులయందు కలుప్రత్యయము.

| | | | |
|---|---|---|---|
| గానుఁగ | గానుఁగలు | అ. | కాణంగళ్. |
| వెలఁగ | వెలఁగలు | ,, | విళగళ్. |

వీనియందు గలు ప్రత్యయము.

ఇట్లు కలు, కులు, గలు, గులు ప్రత్యయములచే సిద్ధించిన రూపములలో క కారగ కారములను ఏకవచనప్రాతిపదికముతోఁ జేర్చిమిగిలిన అలు ఉలులను బహువచనప్రత్యయములుగా వైయాకరణులు గ్రహించుట చేత ఏకవచనమునందులేని రూపములు సిద్ధించినవి.

పైఁజెప్పినపదముల ఏకవచనరూపములను జూడుము.

151. ల్లుకార లికారాంత నామములకు లుప్రత్యయము చేరఁగా మొదటి లకారములకు వైకల్పికము నత్వము అగును.

ఉ. ఇల్లు + లు = ఇన్లు = ఇండ్లు; నలలకు నడుమ డకారాగమము.

కొడవలి + లు = కొడవన్లు = కొడవండ్లు; పైఁజెప్పినది. డకారమునకును నకారమునకును నడుమ ఉకారము రాఁగా ఇండులు కొడవండులు అను రూపములు వచ్చును.

పైశబ్దములకు ఉలుప్రత్యయము చేరఁగా ఇల్లులు, కొడవలులు, కొడవళులు, కొడవళ్లు ఇల్లులు అను రూపములు వచ్చును.

ఇట్లు కల్లు, పల్లు, ముల్లు, విల్లులకు రూపం బెఱుంగునది.

152. రాశి, పేశి, పరదేశి, రాజి, వాజి, రోచి, వీచి మొదలగు వానికి ఉలు ప్రత్యయము పరమగునపుడు వానియందలి తాలవ్య హల్లులకు దంత్యములాదేశములగును.

ఉ. రాసులు, పేసులు, పరదేసులు, రాజులు, వాజులు, రోచులు, వీచులు, ఇత్యాదులు.

153. కూఁతుశబ్దమునకు రువర్ణంబంతాగమంబుగనగు.

ఉ. కూఁతురు -ఈశబ్దము అరుప్రత్యయము చేరిన బహువచనము. ఏకవచనముగాఁ గ్రహింపఁబడుట చేత దానికి బహువచన ప్రత్యయము తిరిగి చేర్పఁబడెను.

**154.** కొన్ని పదములందు బహువచనప్రత్యయములయం దుండెడు రు లు లకు అకారాదేశ మగును.

ఉ. పగవరులు = పగఱు. ఇంపరులు = ఇందఱు.
వేటకారులు = వేటకాఱు ఎంపరులు = ఎందఱు.
అందరులు = అందఱు. కొందరులు = కొందఱు.

**155.** చెయ్యాలు అనుపదమునకు ఉలుప్రత్యయమురాఁగా లకారములకు లోపమును రెండులకారములకును అకారంబును ఆదేశంబగు.

ఉ. చెయ్యాఱు = చెయ్యాలు + ఉలు చెయ్యాలు అనునది ఉలుప్రత్యయాంత మయినబహువచన రూపము. దానితో ఉలు ప్రత్యయము తిరిగిచేర్పఁబడినది.

**156.** కొన్ని పదంబులందు రులుప్రత్యయముల రేఫలకారములకు సంయోగము రాఁగా ఆరేఫలకారములకు నకారరేఫములు క్రమముగా ఆదేశము లగును. ఆనకారరేఫములకు నడుమ డకారమాగమ మయి వచ్చును.

ఉ. వారు = వాండ్రు + వారు + ఉలు = వార్ + లు = వారు. రకారమునకును నకారము. వాన్ + రు = వాన్ + డ్ + రు = వాండ్రు. ఉలుప్రత్యయము యొక్క ఆద్యోకారమునకును వారు శబ్దము యొక్క అంత్యోకారమునకును లోపము

వాఁడు శబ్దమునకు రుప్రత్యయము రాఁగా వాండ్రు అనివచ్చినది అని చెప్పినను తగును. కన్నడమునందు అవందిర్ అనుబహువచనమును జూఁడుము.

157. ఆల్వాదులకు ఉరుప్రత్యయంబు బహువచనమునం దగును. పదాంత ప్రత్యయాద్యుకారములకు లోపమును పూర్వ లకారమునకు నకారాదేశంబును అగును. నకారలకారములకు రెంటికి నడుమ డకార మాగమ మగును.

ఉ. అండ్రు = అలు + ఉరు = అల్ + రు = అన్ + డ్ + రు. ఇట్లు చెలియలు - చెలియండ్రు, చెల్లెలు - చెల్లెండ్రు, కోడలు - కోడండ్రు, మఱఁదలు - మఱఁదండ్రు, జవరాండ్రు, మనుమరాండ్రు, కొమరాండ్రు, ఇవి ఆల్వాదులు.

చెల్లెలు మొదలయినవి అలు ప్రత్యయాంతమయిన బహువచనము ఏకవచనముగా గ్రహింపఁబడుటచేత తిరిగి బహువచనప్రత్యయము చేర్పఁబడును.

158. బహువచనంబుపరంబగునప్పుడు పదాంతములయిన టడరల ఉయక్షరములయుత్వంబునకులోపంబు వైకల్పికంబు.

ఉ. గోఁటులు, గోంట్లు. గోరులు, గోర్లు.
తుంటులు, తుంట్లు. సీవిరులు, సీవిర్లు.
చీటులు, చీట్లు. కాలులు, కాళ్లు.
గుండులు, గుండ్లు. మొసలులు, మొసళ్లు.
తూఁడులు, తూండ్లు. పాలులు, పాళ్లు.

**158.** ఏకపదంబునందు సంయుక్తపరమయిన ఖండబిందువునకు పూర్ణాదేశంబు నిత్యముగ నగును.

ఉ. వాండ్రు, కేండ్లు, ఏండ్లు, తూండ్లు, తేంట్లు, తూంట్లు. కండ్లు, ముండ్లు, పుండ్లు.

**159.** బహువచనము పరం బగునపుడు అసంయుక్తమయిన డలరఱలు అంతమందు గలిగిన శబ్దములయొక్క ఉపధలయిన డలరఱలకు అలఘు ళకారంబు బహుళంబుగ నగు.

ఉ. త్రాడులు, త్రాళులు, గుమ్మడులు, గుమ్మళులు, మొగిలులు, మొగిళులు, గోరులు, గోళులు, ఏఱులు, ఏళులు.

**160.** ఉలుప్రత్యయోకారము లోపింపఁగా ళకారము ళత్వమును బొందును.

ఉ. త్రాళ్లు, గుమ్మళ్లు, మొగిళ్లు, గోళ్లు, ఏళ్లు.

**161.** చేను, మీను, పేను, రేయి, వ్రాయి, వేయి, ఱాయి, ఈశబ్దముల యంత్యవర్ణములకును ఉలు ప్రత్యయముయొక్క మొదటి ఉకారమునకును లోపమగును.

ఉ. చేను + ఉలు = చేలు. వ్రాయి + ఉలు = వ్రాలు.
మీను + ఉలు = మీలు. వేయి + ఉలు = వేలు.
పేను + ఉలు = పేలు. ఱాయి + ఉలు = ఱాలు.
రేయి + ఉలు = రేలు. ఱాయిశబ్దమునకు ఱాళ్లు అనియు రూపము కలదు.

**162.** ఆవు, జాము, మీసము, చుట్టము, ఈశబ్దములకు పైజెప్పిన లోపము వికల్పముగానగు.

ఉ. ఆవు + ఉలు = ఆలు, ఆవులు.
జామ + ఉలు = జాలు, జామలు.
మీసము + ఉలు = మీసలు, మీసములు.
చుట్టము + ఉలు = చుట్టలు, చుట్టములు.

**163.** నపుంసకైక వచనమయిన అము ప్రత్యయమునకు ఇన్ ప్రత్యయ నకారమును ఉలుప్రత్యయమును పరములగునపుడు ము కారమునకు లోపమును దానికి పూర్వమయిన అచ్చునకు దీర్ఘమును పాక్షికంబుగ నగును.

ఉ. దినమునన్ దినానన్ వజ్రములన్ వజ్రాలన్.
దినములు దినాలు పగడమునన్ పగడానన్.
దినములన్ దినాలన్ పగడములు పగడాలు.
వజ్రమునన్ వజ్రానన్ పగడములన్ పగడాలన్.
వజ్రములు వజ్రాలు కతమునన్ కతనన్
దీనికి దీర్ఘంబులేదు.

ఇన్ప్రత్యయము యొక్క ఇకారమునకును ఉలు ప్రత్యయముయొక్క ఉకారమునకు లోపము.

ఇన్ప్రత్యయము షష్ఠీవిభక్తి ప్రత్యయముగా వచ్చుచున్నది. అఱవమునందును దినమునన్ అనురూపమునకు సరియయి ‹ దినత్తినాల్ › అనునది వచ్చుచున్నది. దినత్తినాల్ = దినత్తు + ఇన్ + ఆల్. అట్లేదినమునన్ = దినము + ఇన్ + అన్ = దినమునన్.

ఈసూత్రముచే మీసము చుట్టము శబ్దముల ముకారమునకు లోపమును దానిపూర్వాచ్చునకు దీర్ఘమును పాక్షికముగ నగు.

ఉ. చుట్టములు = చుట్టాలు.

మీసములు = మీసాలు. పై సూత్రముచే మీసలు చుట్టలు అనియు రూపములు గలవు.

164. గోయి మొదలగువానికి ఉలుప్రత్యయము పరము కాఁగా యకారమునకు తత్వము.

ఉ. గోయి + ఉలు = గోతులు. చేసి అనుపదనమునందు ఇ ప్రత్యయము చేరఁగా, యకారమున కు సత్వమువచ్చినదానిని చూడుము.

గోయి, చేయి, దాయి, నూయి, వాయి, నేయి, రోయి ఇవి గోయిప్రభృతులు.

ప్రాలు తాలు వేలు వీనియందు ఈకార్యము లేనిదానిని చూడుము.

165. విభక్తి ప్రతిరూపక పదములు నామములతోఁజేరి విభక్త్యర్థములందు వచ్చు పదములు. దానికి పూర్వమైన పద స్వరూపము విభక్తి ప్రాతిపదిక మనఁబడును.

రామునిచేతన్ అనుదానియందు చేతన్ అనునది విభక్తి ప్రతిరూపక పదము తృతీయార్థము నిచ్చి రామునియను విభక్తిప్రాతిపదికమునకు పరముగా వచ్చినది. 'రామునిచేతన్' అనునది యౌగికార్థముచేత రామునియొక్క చేతియందు చేతిచేతన్ అని అర్థమిచ్చి నప్పటికిని రామశబ్దమునకు తృతీయా

విభక్తి రూపముగా గ్రహింపఁబడి(రామేణ) అనియర్థము నిచ్చుచున్నది.

**166.** ఏకవచనమునందు అండు ఉండు ప్రత్యయము అంతమందుఁగలిగిన నామములు విభక్తి ప్రాతిపదికమునందు ఇకారాంతముగనుండును. ఉండు ప్రత్యయమునకు పరంబుగను కు ప్రత్యయమునకు పూర్వముగను, ఈ ఇ ప్రత్యయమునకు అత్వము వైకల్పికము.

బహువచనమందు అలు ఉలు అంతమందుఁ గలిగిన శబ్దములు ఆకారాంతములుగను, అరు ప్రత్యయమును తజ్జన్యమయిన వురు గురు మొదలయిన ప్రత్యయములును అంతమందుఁ గలిగినవి అకారాంతముగను ఇకారాంతముగను నుండును.

ఈ విభక్తి ప్రాతిపదికములన్నియు షష్ఠ్యంతనామములు. అంతమందుండు అకార ఇకారములు షష్ఠీవిభక్తి ప్రత్యయములు. అకారము కన్నడమందును అరవమునందును వచ్చును.

| | క. | తె. |
|---|---|---|
| ఉ. | రామన | రాముని. |
| | రామర | రాముల. |
| | అవన | వాని. |
| | అవర | వారి. |
| | ఆతన | ఆతని. |

| ఏకవచనము. | | బహువచనము. |
|---|---|---|
| రామునిచేతన్ | రాముచేతన్ | రాములచేతన్ |
| రామునికి | | రాములకు |
| రామునకు | | |

| | | |
|---|---|---|
| రామునియొక్క | రాముయొక్క | రాములయొక్క |
| బల్లిదునిచేతన్ | బల్లిదుచేతన్ | బల్లిదులచేతన్ |
| బల్లిదునికి<br>బల్లిదునకు | | బల్లిదులకు |
| బల్లిదునియొక్క | బల్లిదుయొక్క | బల్లిదులయొక్క |
| మగనిచేతన్ | | మగలచేతన్ |
| మగనికి | | మగలకు |
| మగనియొక్క | | మగలయొక్క |
| బాలునిచేతన్ | బాలుచేతన్ | బాలురచేతన్ |
| బాలునికి<br>బాలునకు | | బాలురకు |
| బాలునియొక్క | బాలుయొక్క | బాలురయొక్క |
| పగతునిచేతన్ | పగతుచేతన్ | పగతురచేతన్ |
| పగతునికి<br>పగతునకు | | పగతురకు |
| పగతునియొక్క | పగతుయొక్క | పగతురయొక్క |
| గురువుచేతన్ | | గురువులచేతన్ |
| గురునిచేతన్ | గురుచేతన్ | గురులచేతన్ |
| గురువునకు<br>గురునకు | | గురువులకు |
| గురునికి | | గురులకు |
| గురువుయొక్క | | గురువులయొక్క |
| గురునియొక్క | గురుయొక్క | గురులయొక్క |
| | | పలువురచేతన్ |
| | | పలువురకు |
| | | పలువురయొక్క |

రాముచేతన్ మొదలయినపదములలో ఇప్రత్యయమునకును తత్పూర్వమయిన నకారమునకును లోపము.

మగనకు అని కుప్రత్యయమునకు పూర్వము అకారము రాదు.

**167.** అ, ఇ, ఈ అంతమందుఁ గలిగిన నామములకు ఏకవచనమునందు విభక్తి ప్రాతిపదికములయొక్క తుదిని అ, ఇ ప్రత్యయములు లోపించియుండును.

| | | |
|---|---|---|
| పిత, | పితచేతఁ, | పితయొక్క. |
| లత, | లతచేతఁ, | లతయొక్క. |
| అన్న, | అన్న చేతఁ, | అన్న యొక్క. |
| అమ్మ, | అమ్మ చేతఁ, | అమ్మయొక్క. |
| శ్రీ, | శ్రీచేతఁ, | శ్రీయొక్క. |
| స్త్రీ, | స్త్రీచేతఁ, | స్త్రీయొక్క. |
| గౌరి, | గౌరిచేతఁ, | గౌరియొక్క. |
| హరి, | హరిచేతఁ, | హరియొక్క. |
| రవి, | రవిచేతఁ, | రవియొక్క. |
| లక్ష్మి, | లక్ష్మి చేతఁ, | లక్ష్మి యొక్క. |

**168.** నపుంసకోకారాంతనామంబుల ఏకవచనమునకు అందు అన్ కి ప్రత్యయముతప్ప మిగిలిన విభక్తిప్రతిరూపక ప్రత్యయములు పరంబగునపుడు విభక్తి ప్రాతిపదికముయొక్క అంతప్రత్యయమయిన ఇన్ ఇప్రత్యయమునకు లోపము.

ఉ. తరువుచేతఁ    తరువుయొక్క
తరువువలనఁ    తరువుకంటెఁ
తరువునకు    తరువునందు
తరువునఁ.

ఈకార్యంబు పుంలింగోకారాంత పదంబులందు అన్ని విభక్తులయందు పాక్షికము.

| | |
|---|---|
| విష్ణువుచేతఁ | విష్ణునిచేతఁ * |
| విష్ణువందు | విష్ణునందు |
| | విష్ణునియందు. |

**169.** సర్వనామంబులలో విభక్తిప్రాతిపదికములు ఏకవచనమునందు ఇకారాంతముగను, బహువచనమునందు అకారాంతముగను ఇకారాంతముగను ఉండును.

| | | | |
|---|---|---|---|
| వాఁడు, | వానిచేతఁ, | వానికి, | వానియొక్క. |
| వీఁడు, | వీనిచేతఁ, | వీనికి, | వీనియొక్క. |
| ఎవఁడు, | ఎవనిచేతఁ, | ఎవనికి, | ఎవనియొక్క. |
| అది, | దానిచేతఁ, | దానికి, | దానియొక్క. |
| ఇది, | దీనిచేతఁ, | దీనికి, | దీనియొక్క. |
| ఎది, | దేనిచేతఁ, | దేనికి, | దేనియొక్క. |
| వారు, | వారిచేతఁ, | వారికి, | వారియొక్క. |

* విష్ణుని మొదలయిన రూపంబులందు ఉండు నకారము రాముని కృష్ణుని మొదలయినవానియందు ఉండెడి ప్రత్యయములోని అనుస్వార సంబంధమయినట్లు (రాముందు + ఇ = రాముం + ఇ = రామున్ + ఇ; దులోపము), విష్ణుఁడు అని దాని ఉండుప్రత్యయమునకు సంబంధించినది (అనఁగా విష్ణుఁడు + ఇ = విష్ణుని; దులోపము.) అని ఆక్షేపింపఁగూడదు. విష్ణుండు శబ్దమునందుండు ఉండుప్రత్యయము తరువు మొదలయిన అమహదర్థకోకారాంత నామములకును మహదర్థక మను శబ్దంబునకును రాకుండుటచేతను, సామాన్యముగా అఱవము కన్నడము ఈభాషలలోను ఉకారాంతశబ్దంబులకు ఉండుప్రత్యయమునకు ప్రకృతియయిన అన్ అనుప్రత్యయము రామిచేతను, అఱవమునందును కన్నడమునందును సమస్తోకారాంతములకు ఇనాగమము వచ్చుటచేత, విష్ణుని, గురుని మనువునకు తరువునకు మొదలయిన పదంబులందలి నకారము ఇనాగమసంబంధమయినది యని తెలియవలసినది.

| | | | |
|---|---|---|---|
| వారలు, | వారలచేతన్, | వారలకు, | వారలయొక్క. |
| | వాండ్రచేతన్, | వాండ్రకు, | వాండ్రయొక్క. |
| వీరు, | వీరిచేతన్, | వీరికి, | వీరియొక్క. |
| వీరలు, | వీరలచేతన్, | | వీరలయొక్క. |
| ఎవరు, | ఎవరిచేతన్, | ఎవరికి, | ఎవరియొక్క. |
| ఏవారు, | ఏవారిచేతన్, | ఏవారికి, | ఏవారియొక్క. |
| ఏవారలు, | ఏవారలచేతన్, | ఏవారలకు, | ఏవారలయొక్క. |
| అందఱు, | అందఱచేతన్, | అందఱకు, | అందఱయొక్క. |
| | అందఱిచేతన్, | అందఱికి, | అదఱియొక్క. |
| ఇందఱు, | ఇందఱచేతన్, | ఇందఱకు, | ఇందఱయొక్క. |
| | ఇందఱిచేతన్ | | ఇందఱియొక్క |
| ఎందఱు, | ఎందఱచేతన్, | ఎందఱకు, | ఎందఱయొక్క. |
| | ఎందఱిచేతన్, | ఎందఱికి, | ఎందఱియొక్క. |

దాని, దీని, దేని అనుపదంబులందు ఏకవచనంబున అన్ ఇప్రత్యయములు రెండును చేరి వచ్చినవి.

దాని = అ. అదన్ + ఇ
= దాని. క. అదర

దీని = అ. ఇదన్ + ఇ
= దీని. క. ఇదర

దేని = అ. ఎదన్ + ఇ
= దేని. క. ఎదర

తెనుంగుపదంబులందు ఇప్రత్యయము అధికముగా వచ్చినది.

170. కొన్ని విభక్తిప్రాతిపదికములందు ఏకవచనమునందు పైఁజెప్పిన ఇ ప్రత్యయమురాఁగా పదాంతహల్లులు మాఱును.

| | | |
|---|---|---|
| త్రాడు, | త్రాటిచేతన్. | త్రాటియొక్క. |
| కాడు, | కాటిచేతన్, | కాటియొక్క. |

| | | |
|---|---|---|
| సొరు, | సొంటిచేతన్, | సొంటియొక్క. |
| నీరు, | నీటిచేతన్, | నీటియొక్క. |
| నూఱు, | నూటిచేతన్, | నూటియొక్క. |
| కన్ను, | కంటిచేతన్, | కంటియొక్క. |
| మిన్ను, | మింటిచేతన్, | మింటియొక్క. |
| విల్లు, | వింటిచేతన్, | వింటియొక్క. |
| పల్లు, | పంటిచేతన్, | పంటియొక్క. |
| వాయి, | వాతిచేతన్, | వాతియొక్క. |
| నూయి, | నూతిచేతన్, | నూతియొక్క. |
| మన్ను, | మంటిచేతన్, | మంటియొక్క. |
| గోరు, | గోటిచేతన్, | గోటియొక్క. |
| ఏఁడు, | ఏఁటిచేతన్, | ఏఁటియొక్క. |
| ఏఱు, | ఏటిచేతన్, | ఏటియొక్క. |
| పగలు, | పగటిచేతన్, | పగటియొక్క. |
| ఇల్లు, | ఇంటిచేతన్, | ఇంటియొక్క. |
| ఊయి, | ఊతిచేతన్, | ఊతియొక్క. |

ఇట్లు కూడు, నాడు, ఘాఁడు, కాడు, గోయి, చేయి, దాయి నేయి, రోలు, మొదలయినవి.

171. కొన్ని విభక్తి ప్రాతిపదికములందు ఏకవచనమునందు ఇప్రత్యయమునకు ముందు ప్రాతిపదికమునకు పరంబుగ ఇన్ ప్రత్యయము వచ్చును. ఇదియు షష్ఠీవిభక్తి ప్రత్యయము. కన్నడమునందు ఈ ఇన్ ప్రత్యయమునకు పరముగ అప్రత్యయము వచ్చును.

| తె. | అ. | క. |
| --- | --- | --- |
| గురుని | గురువిఙ్ | గురువిన |
| విష్ణుని | విష్ణువిఙ్ | విష్ణువిన |

172. కొన్ని విభక్తిప్రాతిపదికములకు ఇఙ్—ఇ ప్రత్యయములు రెండును వచ్చునపుడు ఇ ప్రత్యయమునకు మునుపు నకారమునకు ద్విత్వమును, రెండవనకారమునకు టాదేశమును, టకారమునకు మునుపుండెడు నకారమునకు బింద్వాదేశమును అగును. ఆదేశబిందువునకును పాక్షికముగ లోపము.

| | | | |
| --- | --- | --- | --- |
| పేరు | —పేరిటిచేతఙ్ | పేరిటియొక్క | పేరిటియందు |
| | పేరిచేతఙ్ | పేరియొక్క | పేరియందు |
| | పేరింటిచేతఙ్ | పేరింటియొక్క | పేరింటియందు |
| పగలు | —పగలిటిచేతఙ్ | పగలిటియొక్క | పగలిటియందు |
| | పగటిచేతఙ్ | పగటియొక్క | పగటియందు |
| | పగలింటిచేతఙ్ | పగలింటియొక్క | పగలింటియందు |
| అన్ని | —అన్నిటిచేతఙ్ | అన్నిటియొక్క | అన్నిటియందు |
| | అన్నింటిచేతఙ్ | అన్నింటియొక్క | అన్నింటియందు |
| రెండు | —రెండిటిచేతఙ్ | రెండిటియొక్క | రెండిటియందు |
| | రెండింటిచేతఙ్ | రెండింటియొక్క | రెండింటియందు |
| ఏమి | —ఏమిటిచేతఙ్ | ఏమిటియొక్క | ఏమిటియందు |
| నూఱు | —నూఱిటిచేతఙ్ | నూఱిటియొక్క | నూఱిటియందు |

నూటి పగటి అను రూపమునందు రేఫలకారములకు టకారాదేశమువచ్చినది 170-వ విధి చూడుము. నూఱిటి పగలిటి అను రూపములందు ఇన్ ఇ ప్రత్యయములు వచ్చినవి.

ఇట్లు మొదలు, అన్ని, కొన్ని, ఇన్ని, ఎన్ని; మూఁడు, నాల్గు, మొదలయిన సంఖ్యాశబ్దములు వీని విభక్తిప్రాతిపదికములు వచ్చును.

173. క్రిందు, మీఁదు, ముందు, వెనుకు, మాపు, మొదలయిన శబ్దములకు విభక్తిప్రాతిపదిక రూపమునకు అన్ ఇ ప్రత్యయములు చేరును. నకారమునకు టత్వము.

| | | | |
|---|---|---|---|
| క్రిందు | క్రిందటిచేతన్ | క్రిందటియొక్క | క్రిందటియందు. |
| మీఁదు | మీఁదటిచేతన్ | మీఁదటియొక్క | మీఁదటియందు. |

174. అట్టు, కొట్టు, గొట్టు, మిట్టు, ఈశబ్దములకు ఇన్ ఇ ప్రత్యయములు చేర్పఁబడును. ఇనాగమముయొక్క నకారమునకు తకారము ఆదేశము. తృతీయాసప్తమీ ప్రత్యయము అన్ పరమగునపుడు ఇనాగమముయొక్క ఇకారమునకు లోపము.

అట్టు అటితిచేతన్ అటితియొక్క అటితియందు అటుతన్.

ఇట్లు గుఱిచి, చేతన్, తోడన్, వలనన్, యొక్క, అందు అనువిభక్తి ప్రతిరూపకపదములు అ ఇ ప్రత్యయాంతములైన నామములతోవచ్చి విభక్త్యర్థములను బోధించును.

175. కి కు ప్రత్యయములు పదములు కానివి యయినప్పటికిని అవి విభక్తిప్రతిరూపక పదతుల్యములు. మిగిలినవి శుద్ధప్రత్యయములు.

176. సప్తమీ ద్వితీయా ప్రత్యయము అన్ చేరునపుడును కొన్నిపదంబులందు షష్ఠీప్రత్యయము ఇన్ వచ్చుచున్నది. కారణము మృగ్యము.

| | | | |
|---|---|---|---|
| హరి | హరినిన్ | తరువు | తరువున్. |
| గురు | గురునిన్ | అది | దానన్. / దానిన్. |
| వనము | వనమునన్ | | |

177. అ, ఆ, ఇ, ఈ, అంతమందు గలిగినవి, అమహాదర్థకోకారాంతములు వీనికి ద్వితీయయందు అన్ ఇన్ ఉన్ ప్రత్యయములు క్రమముగాఁ జేర్పఁబడును.

లతన్, వనితన్ రమన్, పితన్, అంతన్ ఇంతన్ ఎంతన్; అంత ప్రత్యయము అకారము.

హరిన్ గిరిన్, నదిన్ మదిన్, తుదిన్ రాశిన్ రాజిన్; అంత ప్రత్యయము ఇకారము.

శ్రీన్, స్త్రీన్, హ్రీన్, భీన్, తరువున్, బాహువున్.

త్మ్మన్, మాన్, భాన్, అంతప్రత్యయము ఉకారము.

178. ఉండు ఉఁడు, అండు అఁడు, ప్రత్యయములంతమందు గలిగిన నామంబులకు ఇన్ ప్రత్యయము ద్వితీయయందువచ్చును. డు లోపముకాఁగా ఉండు ఉఁడు ప్రత్యయముల అనుస్వార స్థానములోనుండెడు నకారమునకును ఇన్ ప్రత్యయముయొక్క ఇకారమునకును పాక్షికముగ లోపము.

రాముండు / రాముఁడు } + ఇన్ = రామున్ + ఇన్ = రామునిన్, రామున్.

అల్లుండు / అల్లుఁడు } + ఇన్ = అల్లున్ + ఇన్ = అల్లునిన్, అల్లున్.

గండండు / గండఁడు } + ఇన్ = గండన్ + ఇన్ = గండనిన్.

మగండు / మగఁడు } + ఇ = మగన్ + ఇన్ = మగనిన్.

అంతప్రత్యయము ఇకారము.

**179.** ఉండు ఉఁడు ప్రత్యయములు పాక్షికముగఁ జేర్పఁబడు పుంలింగనామములకు పైఁజెప్పిన రూపములతో వేఱురూపములును గలవు.

| | | | |
|---|---|---|---|
| దయాళుండు, దయాళుఁడు | దయాళునిన్ | సవితృండు | సవితృనిన్. |
| దయాళువు | దయాళువున్ | సవితృఁడు | సవితృన్. |
| | దయాళున్ | సవిత | సవితన్. |
| గురుండు, గురుఁడు | గురునిన్. | | |
| | గురున్. | | |
| గురువు | గురువున్. | | |

**180.** ఉకారము అంతప్రత్యయముగాఁ గలిగిన ఉకారాంత తత్సమశబ్దములకు ద్వితీయయందు ఉన్ ప్రత్యయము పరముకాఁగా, ఆ అంతప్రత్యయమునకును తత్పూర్వమయిన వకారమునకును పాక్షికముగా లోపము.

| | |
|---|---|
| తరువు | తరువున్ |
| | తరున్ |
| బాహువు | బాహువున్ |
| | బాహున్ |
| బిందువు | బిందువున్ |
| | బిందున్ |

దయాళున్ గురున్ మొదలయినవి వులోపముచేత సిద్ధించుచున్నవి. పై సూత్రముచేత దయాళునిన్ గురునిన్ అను రూపములందు నికారలోపముచేతను రావచ్చును.

**181**. ఇన్ ఇ షష్ఠీవిభక్తి ప్రత్యయములు చేరునపుడు, ఆదేశంబు బొందునట్టి గోయి, వాయి, నోరు, నీరు, మొదలగు నామంబులకు ద్వితీయావిభక్తి ప్రత్యయము వచ్చునపుడు పైఁ జెప్పిన ఆదేశమ్మువచ్చును.

| | | |
|---|---|---|
| గోయి | గ్గోతి | గోతిన్ |
| వాయి | వాతి | వాతిన్ |
| నోరు | నోటి | నోటిన్ నోరిన్ |
| నీరు | నీటి | నీటిన్ |
| త్రాడు | త్రాటి | త్రాటిన్ |

**182**. ప్రథమైక వచనమునందు కుప్రత్యయము పాక్షిక ముగఁ గలిగిన కలన్వాదులకు ప్రథమైకవచనమునందువలె రెండు రూపములు ద్వితీయాదులందును ఏకవచనంబునందు గలవు.

కలను } కలనిన్ కలంకున్.
కలంకు }

కెలంకు } కెలనిన్ కెలంకున్.
కెలను }

**183**. సంబంధార్థక మయిన ఇప్రత్యయము రాఁగా అన్ ఇనాగమములును, ఇనాగముయొక్క నకారమునకు టత్వము మొదలయిన కార్యములును కలిగిన నామములకు ద్వితీయా విభక్తిప్రత్యయము పరమగునపుడు ఇనాగమము మొదలయిన కార్యములు వచ్చును.

| | | |
|---|---|---|
| వేయి | వేయిటి | వేయిటిన్ |
| పేరు | పేరిటి | |
| | పేరి | పేరిన్ |

| | | |
|---|---|---|
| పగలు | పగలిటి | పగలిటిక౯ |
| | పగటి | పగటిక౯ |
| రెండు | రెండిటి | రెండిటిక౯ |
| | రెంటి | రెంటిక౯ |
| నూఱు | నూఱిటి | నూఱిటిక౯ |
| | నూటి | నూటిక౯ |
| క్రిందు | క్రిందటి | క్రిందటిక౯. |
| మీఁదు | మీఁదటి | మీఁదటిక౯. |
| అఱ్ఱు | అఱితె | అఱితిక౯. |
| కొఱ్ఱు | కొఱిఁటి | కొఱిఁటిక౯. |

**184.** సప్తమీ విభక్తియందు అన్ ప్రత్యయము, ఉకారాంతము, అము ప్రత్యయాంతము, ఇకారాంతము అయిన నపుంసకలింగ పదములకు పాక్షికముగాఁ జేర్పఁబడును. కలన్వాదులయందు కు ప్రత్యయాంతరూపములకు ఈ అన్ ప్రత్యయము చేర్పఁబడదు. కు ప్రత్యయములేని రూపములకు అన్ ప్రత్యయము పాక్షికముగ వచ్చును.

| | | | |
|---|---|---|---|
| తరువు | తరువున౯ | తరున౯ | దీనియందు అన్ షష్ఠీవిభక్తిప్రత్యయము ఇన్ ప్రత్యయములోఁ జేరి వచ్చెను. అ. తరువినాల్. |
| వనంబు | వనంబున౯ | | దీనియందును ఇన్ ప్రత్యయములోఁ జేరివచ్చెను. అ. వనమునాల్. |

| | | | | |
|---|---|---|---|---|
| మది | మదిన్. | | | అన్ ప్రత్యయము యొక్క అకారమునకు లోపము. |
| తుది | తుదిన్. | | | |

| | | | | | |
|---|---|---|---|---|---|
| త్రాడు | త్రాటన్, | తృ. | స. | త్రాటిన్ | ద్వి. |
| కన్ను | కంటన్ | ,, | ,, | కంటిన్ | ,, |
| విలు | వింటన్ | ,, | ,, | వింటిన్ | ,, |
| చేయి | చేతన్ | ,, | ,, | చేతిన్ | ,, |
| కొడవలి | కొడవటన్ | ,, | ,, | కొడవటిన్ | ,, |
| వేయి | వేయిటన్ | ,, | ,, | వేయిటిన్ | ,, |
| ఱాయి | ఱాతన్ | ,, | ,, | ఱాతిన్ | ,, |
| మేను | మేనన్ | ,, | ,, | మేనిన్ | ,, |
| చేను | చేనన్ | ,, | ,, | చేనిన్ | ,, |
| కలను | కలనన్ | ,, | ,, | కలనిన్ | ,, |
| ఏఁడు | ఏఁటన్ | ,, | ,, | ఏఁటిన్ | ,, |
| గోరు | గోటన్ | ,, | ,, | గోటిన్ | ,, |
| ఊరు . | ఊరన్ | ,, | ,, | ఊరిన్ | ,, |
| పేరు | పేరిటన్ | ,, | ,, | పేరిటిన్ | ,, |
| | పేరన్ | ,, | ,, | పేరిన్ | ,, |
| కాడు | కాటన్ | ,, | ,, | కాటిన్ | ,, |
| పగలు | పగలిటన్ | ,, | ,, | పగలిటిన్ | ,, |
| | పగటన్ | | | పగటిన్ | ,, |
| క్రిందు | క్రిందన్ | ,, | ,, | క్రిందిన్ | ,, |
| | క్రిందటన్ | ,, | ,, | క్రిందటిన్ | ,, |
| మీఁదు | మీఁదన్ | ,, | ,, | మీఁదిన్ | ,, |
| | మీఁదటన్ | ,, | ,, | మీఁదిటిన్ | ,, |
| అన్ని | అన్నిటన్ | ,, | ,, | అన్నిటిన్ | ,, |
| పెక్కు | పెక్కుటన్ | ,, | ,, | పెక్కుటిన్ | ,, |

| | | | | | |
|---|---|---|---|---|---|
| రెండు | రెండింటన్ | తృ. | స. | రెండిటిన్ | ద్వి |
| | రెంటన్ | ,, | ,, | రెంటిన్ | ,, |
| మూఁడు | మూఁడిటన్ | ,, | ,, | మూఁడిటిన్ | ,, |
| | మూటన్ | ,, | ,, | మూటిన్ | ,, |

త్రాటి మొదలయిన ఉదాహరణములందు సప్తమీప్రత్యయము అన్ తృతీయార్థమునందును వచ్చును. అన్ ప్రత్యయము చేర్చునపుడు వచ్చునట్టి కార్యములు ద్వితీయా ప్రత్యయము అన్ చేర్చునప్పుడును వచ్చుచున్నవి.

| | | | | | |
|---|---|---|---|---|---|
| **185.** | అది | దానన్ | దానిన్ | క. | అదనన్ను |
| | ఇది | దీనన్ | దీనిన్ | ,, | ఇదనన్ను |
| | ఎది | దేనన్ | దేనిన్ | ,, | ఎదనన్ను |

వీనిలో సప్తమీ ప్రత్యయము అన్, ద్వితీయా ప్రత్యయము ఇన్. ఇవి షష్ఠీ ప్రత్యయమయిన అన్ప్రత్యయముతోఁ జేరి వచ్చుచున్నవి సర్వనామ ప్రకరణమును చూడుము.

—:0:—

## సర్వనామప్రకరణము.

186. అ-ఆ, ఇ-ఈ, ఎ-ఏ సర్వనామ విశేషణములు.

వాఁడు, వీఁడు, ఎవఁడు, ఏఁడు.

వారు, వీరు, ఎవరు, ఏరు.

అది, ఇది, ఎది.

అవి, ఇవి, ఎవి.

ఈవు, నీవు.

మీరు, మీరలు, ఈరు, ఈరలు.

నేను, ఏను.

ఏము, మేము, నేము, మనము.

అన్ని, ఇన్ని, కొన్ని, అందఱు, ఇందఱు, ఎందఱు, కొందఱు, పెక్కు, పెక్కులు, పలుగురు, పెక్కురు, పెకండ్రు, అట్టి, ఇట్టి, ఎట్టి, అట్టిఁడు, అట్టిరు, ఇట్టిఁడు, ఇట్టిరు, ఎట్టిఁడు, ఎట్టిరు, అట్టిది, అట్టివి, ఇట్టిది, ఇట్టివి, ఎట్టిది, ఎట్టివి, అంత, ఇంత, ఎంత, కొంత.

187. వాఁడు = అ - అవన్. అవన్ + ఉ = అవన్ + డ్ + ఉ = అవండు = వాండు = వాఁడు. డకారాగమమును నకారమునకు అనుస్వారాదేశమును వెనుక ఖండాదేశమును వచ్చినవి.

ఇట్లు, వీఁడు = అ. ఇవన్ + డ్ + ఉ. ఇ + అన్ = ఇయన్ అని యకార ముండవలసినది. దానిస్థానములో అవన్ అనుశబ్దముయొక్క సామ్యముచేత ఇయన్ ఇవన్ అని వచ్చెను.

ఎవఁడు = అ. ఎవన్ + డ్ + ఉ.

ఎ + అన్ = ఎయన్ అని ఉండవలసినది. ఎవన్ అని వైశ్యు ముపలె వకారముతో వచ్చినది.

అది - అ. అవన్ + ఇ = అవ్ + ఇ + అది. అన్లోపమును వకారమునకు దకారాదేశమును వచ్చినవి. క్రియాప్రకరణములోను అది ప్రత్యయమును చూడుము-

ఇట్లు - ఇది = అ. ఇవన్ + ఇ = ఇవి = ఇది.

ఎది = అ. ఎవన్ + ఇ = ఎవి = ఎది.

ఈ అది ఇది ఎది, అను పదములు స్త్రీలింగమునందు వచ్చెడు ఇ ప్రత్యయమును అవన్ మొదలయిన పదములకు చేర్చుటచేత వచ్చినవి. ఇవి వేఱు. నపుంసకలింగమునందు వచ్చెడు అది మొదలయిన శబ్దములు వేఱు.

వారు = ఆ - అవర్ + ఉ.

అది = అ. అదు. అదు యొక్క ఉకారమునకు ఇత్వము.

అవి = అ. అవై. అవై యొక్క ఐకారమునకు ఇత్వము.

188. నీవు / ఈవు } ప్రాంతక-ఈన్ + ఉ = ఈను. ప్రా. క. ఈమ్ ఏకవచన బహువచనములకును వచ్చును. దీనికి నకారాగమము ఆదియందు రాఁగా నీమ్ అనివచ్చును.

ఈ నీమ్ అనునది అఱవములో మీరు అను అర్థము లోవచ్చును. ఇది అఱవములో చింతామణి అను ప్రాచీన గ్రంథములో ప్రయోగింపఁబడి యున్నది.

ప్రాచీనకన్నడమందు నీమ్ అను సర్వనామము, మకారము నకారమగుటచేతను నీను అని వచ్చినది. తెనుంగునందు ఆ మకారమునకు వకారాదేశంబు

రాఁగా నీవు అని వచ్చినది. నీమ్ శబ్దమునకు ఈమ్ అనునది రూపాంతరము. ఈ నీమ్, ఈమ్ శబ్దములకు ఉ ప్రత్యయమును అంతమందు చేర్చి మకారమునకు వకారాదేశమును ఉంచినయెడల ఈవు నీవు శబ్దములు ఏకవచనమునందు సిద్ధించును.

ఈరు, ఈరలు, మీరు, మీరలు — ఈవుశబ్దమునకు ఉరు అనుబహువచన ప్రత్యయము రాఁగా ఈవురు అని వచ్చినది. ఉకారము లోపింప, ఈరు అనురూపము సిద్ధించును. ఈరు + అలు = ఈరలు ఈరుశబ్దమునకు బహువచనము అలుప్రత్యయము తిరిగి చేర్పఁబడినది.

ఈమ్ శబ్దమునకు, ఉరు ప్రత్యయమును జేర్ప, ఈమురు అని వచ్చును. వర్ణప్లుతి విధిచేత ఈకారము మకారమునకు వెనుక దుమికి ఉకారస్థానములో నిలిచినయెడల మీరు అనిరూపము వచ్చుచున్నది.

ఈమురు = మ్ + ఉ + ఈ + రు.
= మ్ + ఈ + రు.
= మీరు.

మీరుశబ్దమునకు అలు ప్రత్యయముచేర్పఁగా, మీరలు అనుశబ్దము వచ్చుచున్నది.

నీ — నీను అను కన్నడపదముయొక్క ఈకారమునకు హ్రస్వము రాఁగా నిన్ వచ్చును ద్వితీయావిభక్తి ప్రత్యయము ఉన్ రాఁగా, నినున్ అనియు, ఇందలి నకారమునకు ద్విత్వము రాఁగా నిన్నున్ అనియువచ్చును. అరవములో నిన్నై, నున్నై, నిన్నిల్, నున్నిల్, అనియు, కన్నడములో నిన్నం, నిన్నల్లి, అని నిన్ నున్ అను ప్రాతిపదికములు వచ్చును.

ఈ నిన్ అను ప్రాతిపదికము ద్వితీయయందు మాత్రము వచ్చును. నీవుయొక్క ప్రాచీనరూపమైన ఈన్ అను శబ్దమునకు షష్ఠీవిభక్తియందు ఇన అను రూపమువచ్చును. అఱవమునందు విభక్తిప్రతిరూపశబ్దములలో సంబంధార్థకమయిన అప్రత్యయములోపించును.అ. నిన్, క. నిన్న చూడుము. వర్ణవ్యత్యయముచే ఇకారము నకారమునకు వెనుకరాఁగా నీ అనివచ్చును.

ఇన = న్ + అ + ఈ = న్ + ఈ = నీ.

నిన్నుఁ, నీది, నీయది, నీదు, నీదుపలక. నీదు = అ. ఉనదు, మూలరూపము ఇనదు, షష్ఠ్యేకవచనము.

మీ—మీరుశబ్దముయొక్క ప్రాచీనరూపమయిన ఈమ్ అనుదాని వలనఁబుట్టిన ఇమ్ అనునది షష్ఠ్యర్థకమయిన అప్రత్యయముతోరాఁగా ఇమ అని వచ్చును. అ. నుమ్, ఉమ్, క. నిమ్మ చూడుము. ఈకారము వర్ణవ్యత్యయవిధిచేత మకారమునకు వెనుకరాఁగా మీ అని వచ్చును. ఇమ = మ్ + అ + ఈ.

మిమ్—ఈన్‌శబ్దమునకు నకారము ఆద్యాగమము వచ్చుటచే నీన్ అని అయి నిన్ అను ప్రాతిపదికమువచ్చునట్లు, ఈమ్ అనుదానికి మకారము ఆద్యాగమమురాఁగా మీమ్ అనురూపమునుబొంది మిమ్ అనివచ్చినది.

మిమ్ముఁ, మీది, మీయది, మీపుస్తకము.

189. నేను / ఏను — ప్రా. క. ఆమ్ అనునది మూలరూపము. దీని మకారమునకు నకారాదేశముచేసి నిరర్థకప్రత్యయమయిన ఉకారమునుచేర్పఁగా ఆను అనురూపమువచ్చును. ఆకారమునకు ఏత్వముచేసిన, ఏనువచ్చును. నీవునందు నకారము ఆద్యాగమమయినట్లు ఆను అనుదానికి మొదట నకారాగమమును ఆకారమునకు ఏకారాదేశమునురాఁగా నేనువచ్చును.

నన్ } — ద్వితీయావిభక్తియందు నానుశబ్దముయొక్క ఆకా
నా } రంబునకు హ్రస్వమురాఁగా నన్ అగును. పైఁజెప్పిన
ఆనుశబ్దమువలనను అన్ అనునదిపుట్టి షష్ఠ్యర్థకమ
యిన అప్రత్యయముతోఁ జేరఁగా అన అనునది
వచ్చుచున్నది. అ. ఎన్, క. ఎన్న చూడుము. అకా
రవర్ణప్లుతివిధిచే నకారమునకు వెనుకను పోఁగా నా
అని వచ్చును. నా = న్ + అ + అ.

ఉ. నన్నుఁ, నాపుస్తకము, నాది, నాయది, నాదుపలక,
నాదు = అ. ఎనదు.

ఈ నాదు అనుపదము షష్ఠీవిభక్తిరూపము అ. ఎనదు,
క. ననదు వలె వచ్చినది. అదు షష్ఠీప్రత్యయము.
నాదు అనుదానికి మూలరూపము అనదు అని యుం
డవలయు.

ఏము }
మేము } — ప్రాత క. ఆమ్. దీనికి ఉప్రత్యయమును ఆకారము
నేము } నకు పాక్షికముగా ఏకారమునురాఁగా, ఆము,
ఏము. నాను అనుపదమునందు నకారాగమము మొ
దటవచ్చినట్టు ఆము ఏము లకు మకారాగమము వ
చ్చిన మేము, మాము అనునవి సిద్ధించును. నామ్ అను
అరవపదమునకు ఉకారమురాఁగా నామువచ్చును,
ఆకారమునకు ఏత్వమురాఁగా నేము వచ్చును.

మమ్ — మాముయొక్క ఆకారమునకు హ్రస్వమురాఁగా మమ్
అనివచ్చును.

మా — ఆమ్ ఆకారమునకు హ్రస్వమును అప్రత్యయమును
రాఁగా అమ వచ్చును. అకారము మకారమునకు
వెనుకవచ్చి దీర్ఘముకాఁగా మా. అమ = మ్ + అ +
అ = మా.

మనము—నామ్‌శబ్దమునకు అము అను ఉత్తమపురుషబహువచనప్రత్యయముచేర్చి దీర్ఘమును హ్రస్వముచేయఁగా నమములనివచ్చి వర్ణవ్యత్యయముచేత మనములగును.

మన—నామ్‌శబ్దమునకు అ అను షష్ఠీవిభక్తిప్రత్యయమును ఆకారమునకు హ్రస్వమును రాఁగా నమ అనివచ్చును. అ. నమ్, క. నమ్మ. వర్ణవ్యత్యయముచేత నమ మన అయినది.

మాపుస్తకము, మాది, మాయది, మనపుస్తకము, మనది.

190. అన్ని, ఇన్ని, ఎన్ని, కొన్ని.

ఇవి సర్వనామవిశేషణములు; సముదాయార్థకములు.

అ. అనైై, క. అని.

,, ఇనై, ,, ఇని.

,, ఎనై, ,, ఎని.

ఇవి నిత్యబహువచనంబులు. మహదర్థకమునందు వరు ప్రత్యయముచేర్పఁగా, అనివరు, అ. అనైవర్, క. అనిబరు, అనైవరు=అన్వరు. ఐలోపము. అందరు, వకారమునకు దకారము. నకారమునకనుస్వారము.

అందరు అనుదానికి లు ప్రత్యయముచేర్చి రలలకు ఆకారాగమమును చేయఁగా అందఱు. అందరు+లు=అందఱు.

ఆకారమునకు పూర్వమయిన అకారమునకు ఒత్వము పాక్షికముగా వచ్చినయెడల అందొఱు.

ఇట్లే ఇనివలన, ఇందఱు, ఇందొఱు; ఎనివలన ఎందఱు, ఎందొఱు.

కొందఱు. అ. శిల, క. కెల. వీనికి సంబంధమయినది తె. కొన్ని. క. కెల అనునది అని, ఇని, ఎని పదములసా

మ్యముచేత కెని అని మాఱి కొని అయినది. కొనివరు=కొన్వరు=కొందరు. ఉ ప్రత్యయము చేరఁగా కొందఱు. అకారమునకు ఒత్వము రాఁగా కొందొఱు.

పలుగ్వురు } — పలశబ్దమునకు వరుప్రత్యయముచేర్పఁగా పలవరు. వర్ణసమీకరణవిధిచేత లవలతోఁ చేరిన అకారములకు ఉత్వము. వకారమునకు పాక్షికముగ గత్వము.
పలువురు }

పలుగుంద్రు—పలుగురు అనుశబ్దమునకు ఉ ప్రత్యయముచేర్చి రలలకు నరాదేశముచేయఁగా పలుగున్రు. నకార రేఫములకు నడుమ డాదేశమురాఁగా పలుగుంద్రు.

పెక్కుఱు—పలుగురు=పల్గురు. లకారముతోఁ చేరిన ఉత్తునకు లోపము.

=పల్కుఱు. లగలకు కద్వయాదేశము. అత్తున కెత్వమును రాఁగా
=పెక్కుఱు.

పెక్కండ్రు—అ. పలవర్=పలవరు. ఉకారము అంత్రప్రత్యయము.
=పల్వరు. లకారముతోఁజేరిన అకారమునకు లోపము.
=పల్గరు. వకారమునకు గకారము.
=పక్కరు. లగలకు కద్వయాదేశము.
=పెక్కరు. పకారముతోఁజేరిన అకారమునకు ఎత్వము.
=పెక్కరు.
ఉ ప్రత్యయమునుచేర్చి రలలకు నరాదేశమును చేయఁగా

పెక్కన్రు. నకారరేఫములకు నడుమ దకారాదేశము రాఁగా పెక్కండ్రు.

పెక్క / పెక్కులు — అ. పలశబ్దమునకు ఉలు ప్రత్యయముచేర పలవులు. లకారముతోఁజేరిన అకారమునకు ఉత్వము రాఁగా, పలువులు,పెల్గులు, పక్కులు, కడపటను పెక్కులు పైశబ్దమువలెవచ్చినది.

ఈశబ్దంబునందు కులు అనునది బహువచనప్రత్యయము. వైయాకరణులు ఉలు అనుభాగమును బహువచనప్రత్యయముగాఁగ్రహించుటచే, పెక్క అనిభాషలో లేనిరూపము ఏకవచనమునకు నిర్ధించెను. కలఁకు, గవఁకు మొదలయినశబ్దములను చూడుము.

అంత— అ. అనై అను సర్వనామ విశేషణమునకు నపుంసక బహువచన ప్రత్యయమయిన అక్కారమును చేర్ప అనైయ అనునది వచ్చును. ఇది సంక్షేపముచేత అన్న అగును; దీనికి అఱవములో అటువంటివి,అప్రమాణముకలిగినవి అని యర్థము. అన్న శబ్దముయొక్క రెండవనకారమునకు తాదేశమును మొదటినకారమునకు అనుస్వారాదేశమునురాఁగా అంత అయినది.

ఇంత— అ. ఇనైయ - ఇన్న, తె. ఇంత.

ఎంత— ,, ఎనైయ - ఎన్న, తె. ఎంత.

కొంత— కొన్ని శబ్దమువలన అంత ఇంత శబ్దముల సాదృశ్యముచేఁ బుట్టినది.

కొన్ని + అ = కొన్న = కొంత,

అట్టివాఁడు } — అట్టి. సర్వనామ విశేషణము. వాఁడు ప్రత్య
అట్టెడు } యము. అట్టివాఁడు = అట్టివఁడు = అట్టియఁ
డు = అట్టెఁడు.

ఇట్లు ఇట్టివాఁడు, ఇట్టెఁడు, ఇట్టివారు, ఇట్టెరు, ఎట్టివాఁ
డు, ఎట్టెఁడు, ఎట్టివారు, ఎట్టెరు, అట్టివారు, అట్టెరు.

అట్టిది } — అట్టి + అది = అట్టిది. అట్టి + అవి = అట్టివి.
అట్టివి }

ఇట్లు ఇట్టిది, ఎట్టిది, ఇట్టివి, ఎట్టివి.

అలవాఁడు — అ. అన్నెయ అనువిశేషణము అన్న అగును. దీనియందలి నకారద్వయమునకు లకారాదేశంబు రాఁగా అల అని వచ్చును. దానికి వాఁడుప్రత్యయ ముచేరగా అలవాఁడు.

అలది — అల + అది.

అలవారు — అల + వారు. ఎల్ల పదమును చూడు.

తాను — ప్రా. క. తామ్ శబ్దము ఏకవచన బహువచనములకు సామాన్యము. ఉప్రత్యయమును మకారమునకు నకారాదేశమునురాఁగా, తాను అని సిద్ధించినది. నేను, నేము చూడుము.

తాము — ఉప్రత్యయము మాత్రము.

తమరు = తాము + అరు. = తాము రు, ఆకారమునకు హ్రస్వము.
తారు = తమరు.

తన్నున్ } ద్వితీయాప్రత్యమునకును షష్ఠీ ప్రత్యయమయిన అ
తమ్మున్ } కారమునకును మునుపు తాను తాము శబ్దముల ఆ
కారమునకు హ్రస్వాదేశము.

తన=తాను + అ.

తమ=తాము + అ.

ఎల్లవారు
ఎల్లరు
ఎల్ల

అ. అనైవర్ (తె. అందఱు) అనుపదములో ప్రాతిపదికమయిన అనై అనుపదము అన్న, అల్ల, ఎల్ల అని వికృతమయి సమస్తము అనే అర్థములో నుపయోగింపఁబడుచున్నది. దానికి వారు ప్రత్యయము చేరఁగా ఎల్లవారు వచ్చుచున్నది.

అ. ఎల్లార్. ఎల్లరు శబ్దమునందు అరుప్రత్యయము చేర్పఁబడుచున్నది.

## 191. విభక్తిరూపములు.

| | | | | |
|---|---|---|---|---|
| వాఁడు | వారు | వారలు | వాండ్రు | ప్ర. |
| వానికి | వారికి | వారలకు | వాండ్రకు | ద్వి. |
| వాని | వారి | వారల | వాండ్ర | విభ. ప్రా. |
| వీఁడు | వీరు | వీరలు | వీండ్రు. | ప్ర. |
| వీనికి | వీరికి | వీరలకు | వీండ్రకు | ద్వి. |
| వీని | వీరి | వీరల | వీండ్ర | విభ. ప్రా. |
| ఎవఁడు | ఎవరు | | ఎవండ్రు | ప్ర. |
| ఏఁడు | ఏరు | | | |
| వేఁడు | వేరు | ఎవఁడుయొక్క వర్ణవ్యత్యయరూపములు. | | |
| ఏవాఁడు | ఏవారు | ఎవారలు | ఏవాండ్రు. | |
| ఎవ్వాఁడు | ఎవ్వారు | ఎవ్వారలు | ఎవ్వాండ్రు. | |
| ఎవ్వఁడు | ఎవ్వరు | ఎవ్వండ్రు. | | |
| ఏని | ఏరి. | | | |
| ఎవని | ఎవరి. | | | |
| వేని | వేరి. | | | |
| ఏవాని | ఏవారి | ఏవారల | ఏవాండ్ర | విభ. ప్రా. |

| | | | |
|---|---|---|---|
| ఎవ్వాని | ఎవ్వారి | ఎవ్వారల | ఎవ్వాండ్ర. |
| ఎవని | ఎవరి | ఎవ్వండ్ర. | |

ఇట్లే ఇతర విభక్తులను ఊహించుకొనవలయు.

అది, స్త్రీలింగము.

దీనికి ఏకవచన రూపములు. ఒకతె (ఒరు + అది = ఒర్వది = ఒక్కతి) అను శబ్దమునుండి, ఒకతెని, ఒకతెయొక్క, ఒకతెచేతన్ మొదలయిన రూపములు వచ్చునట్లు అదిని, అదియొక్క అనిరూపములు రావలెను. అట్లురాక అరవ నపుంసకలింగమయిన అదు శబ్దమునుండివచ్చిన అది అనుదానికి వచ్చునట్లు దాని, దానిన్, దానిచేత, దానియొక్క అని రూపములువచ్చును. ౧౬౯-వ విధిని చూడుము.

| | | |
|---|---|---|
| అది<br>అద్ది<br>ఆయది<br>ది | అవి<br>అవ్వి<br>ఆయవి<br>అయ్యవి | ప్ర. |
| దానిన్,<br>ఆదానిన్,<br>అద్దానిన్ | వానిన్ | ద్వి. |
| దాని<br>ఆదాని<br>అద్దాని | వాని. | విభక్తి ప్రా. |

ఇది శబ్దము.

| | | |
|---|---|---|
| ఇది<br>ఇద్ది<br>ఈయది<br>ఇయ్యది | ఇవి<br>ఇవ్వి<br>ఈయవి<br>ఇయ్యవి | ప్ర. |
| దీనిన్, ఇద్దానిన్, ఈదానిన్ | వీనిన్ | ద్వి. |

దీని
ఇద్దాని } వీని విభ. ప్రా.
ఈదాని
దీనన్ సప్తమివిభక్తి ప్రత్యయము అన్

## ఏదిశబ్దము.

ఏది, ఎది, ఎద్ది — ఏవి, ఎవి, ఎవ్వి } ప్ర.
ఏయది, ఎయ్యది — ఏయవి, ఎయ్యవి
దేనిన్, ఏదానిన్, ఎద్దానిన్ — వేనిన్ ఏవానిన్ ఎవ్వానిన్ ద్వి.
దేని — వేని
ఏదాని — ఏవాని } విభ. ప్రా.
ఎద్దాని — ఎవ్వాని
ఏదానన్, ఎద్దానన్ సప్తమీప్రత్యయము అన్.

## నీవుశబ్దము.

ప్ర. నీవు — మీరు, ఈరు.
ఈవు — మీరలు, ఈరలు.
ద్వి. నిన్నున్ — మిమ్మున్.
నినున్ — మిమున్.
నీ — మీ. విభ. ప్రా.
నకారద్వయములోను మకారద్వయములోను ఒకటికి లోపము.
నీ. — మీ. సమస్తషష్ఠి.

## నేనుశబ్దము.

ప్ర. నేను — మేము.
ఏను — ఏము.
నేము, మనము.
ద్వి. నన్నున్ — మమ్మున్.
ననున్ — మమున్.
నా — మా, మన.

## అన్ని శబ్దము.

దీని విభక్తిప్రాతిపదికమునకువచ్చు ప్రత్యయములు ఇన్, ఇ. ఇన్ప్రత్యయ నకారమునకు ద్విత్వము. రెండవనకారమునకు టత్వమును మునుపటి నకారమునకు బింద్వాగమమును అగును. ఈబిందువునకు పాక్షికముగ లోపము.

అన్ని + ఇన్ + ఇ = అన్నిన్ని.
= అన్నింటి.
= అన్నిటి. బిందువునకు పాక్షిక [లోపము.
అన్నింటిన్.
అన్నిటిన్.
అన్నింటన్.
అన్నిటన్.

ఇట్లు, ఇన్ని - ఇన్నింటి
ఇన్నిటి.
ఎన్ని - ఎన్నింటి
ఎన్నిటి.
కొన్ని - కొన్నింటి
కొన్నిటి. మొదలగునవి.

అంత - అంతన్ - అంతకు - అంతలోన్.
ఇంత - ఇంతన్ - ఇంతకు - ఇంతలోన్.
ఎంత - ఎంతన్ - ఎంతకు - ఎంతలోన్.
కొంత - కొతన్ - కొంతకు - కొంతలోన్.

## తాను శబ్దము.

తాను - తాము. తమరు. తారు.
తాన్నున్ - తమ్మున్.
తనున్ - తమున్.
తన - తమ.

## సంఖ్యానామప్రకరణము.

—:౦:—

**192.** ఒండు = అ. ఒన్ఱు, క. ఒందు. ఒందుయొక్క దకారము నకు డత్వము.

ఒకటి = ఒరువది - ఒరు - ఒకటి. అది నపుంసకప్రత్యయము.
= ఒర్వది. ఉత్లోపము.
= ఒక్కటి. రేఫవకారములకు కద్వయము. దకారమునకు టత్వము.

రెండు = అ. ఇరండు. వర్ణవ్యత్యయవిధిచేత ఇకారము రేఫమునకు పరముగావచ్చి ఎకారమయ్యె.

మూఁడు = అ. మూన్ఱు. ఱకారమునకు డత్వము. నకారమునకు ఖండబిందువు.

నాల్గు = అ. నాన్గు. దీనియందలి గకారమునకు పూర్వమయిన లకారము సహజము. అఱవమునందు మాత్రము దానికి నత్వము.

ఏదు } అయిదు } = అ. ఐందు. అనుస్వారమునకు లోపము. అనుస్వారస్థానములో నర్ధానుస్వార ముండవలసినది విడువఁబడినది. ఐకారమునకు అయి ఆదేశము.

ఆఱు = అ. ఆఱు.

ఏడు = అ. ఏఴు. ఴకారమునకు డత్వము.

ఎనిమిది = అ. ఎణ్బదు. కడపటి ఉకారమునకు ఇకారాదేశము. దానినిబట్టి వర్ణసమీకరణవిధిచే అకారమున కిత్వము, ణకారమున్నకు నాదేశము, బకారమునకు మాదేశము,

నకారమునకు వెనుక ఇకారాగమము. ఎనుబది యనునర్థము కలిగిన యెనిమిదియను పదమునకు ఏడునొకటియను నర్థము ప్రయోగముచేత సిద్ధించెను.

తొమ్మిది = అ. తొన్బదు. ఒన్బదు యొక్క మూలరూపము. తొల్ అనఁగా పూర్వము. పదు పది. పదికి పూర్వమయినది.

పది = అ. పత్తు.

పదునొకటి = అ. పదినొన్ఱు. పత్తుశబ్దమునకు సరియయిన పదుశబ్దమునకు ఇక్ ప్రత్యయము వెనుక, తోడ అను నర్థమునందువచ్చినది. 'పదిసంఖ్యకుపైన నొకటి' అని యర్థము. ఇన్ప్రత్యయముయొక్క ఇకారమునకు లోపము. ఒన్ఱుస్థానములో నొకటి.

పండ్రెండు = అ. పన్నిరండు=పన్రెండు. అ. ఇరెండుకు బదులు తె. రెండు. పన్ + డ్ + రెండు. నకార రేఫములకు నడుమ డకారము. నకారమునకు బిందాదేశము. 47-వ విధిని జూడుము.

పదుమూఁడు = పది+మూఁడు. వర్ణసమీకరణవిధిచేత దకారముతోఁజేరిన ఇకారమునకు ఉత్వము.

పదునాల్గు = పది+నాల్గు. ఉత్వము పైఁజెప్పినట్లు. పన్రెండు మొదలయినవానిలో ఇక్ ప్రత్యయము లోపించినది.

పదునేను = అ. పదినైందు. పదిన్ + ఏను = పదినేను, ఉత్వము పైఁజెప్పినట్లు.

పదునాఱు = అ. పదినాఱు. ఇత్తునకుత్వము.

పదునేడు = అ. పదినేఱు.

పదునెనిమిది = అ. పదినెట్టు. ఎట్టుస్థానములో నెనిమిది.

పందొమ్మిది = పది+తొమ్మిది=పన్తొమ్మిది=పందొమ్మిది. పదియొక్క—దకారమునకు నత్వము. నకారమునకు పరమైన తకారమునకు దత్వము. నకారమునకు బింద్వాదేశము.

ఇరువది = ఇరు పది. అ. ఇరండునకు సమాసమునందు ఇరు అని రూపము. పకారమునకు వత్వము.

ఇరువదియొకటి = ఇరువది + ఒకటి.

ముప్పది = మూడుపది. సమాసమునందు మూఁడునకు అంత్యవర్ణలోపము రాఁగా మూ అని రూపము. మూ + పది = ముప్పది. ఊకారమునకు హ్రస్వము. పకారమునకు ద్విత్వము.

నలువది = నాల్గుపది. నాల్గుకు సమాసమునందు అంత్యవర్ణలోపము. ఆకారమునకు హ్రస్వము. పకారమునకు వత్వము.

ఏఁబది = ఐందుపది. ఐందుయొక్క— అంత్యదుకారమునకు లోపమును, ఐకారమునకు ఏకారాదేశమును, పకారమునకు బత్వమును, అనుస్వారమునకు ఖండమును రాఁగా ఏఁబది.

అఱువది = ఆఱు పది. ఆఱుయొక్క— ఆకారమునకు హ్రస్వము. పకారంబునకు వకారంబు.

డెబ్బది = ఏడుపది. వర్ణవ్యత్యయముచేత ఏకారము డకారమునకు వెనుకవచ్చి ఉకారమునకు

ఆదేశముకాఁగా డేబది అని వచ్చినది. ఏ కారమునకు హ్రస్వమును, బకారమునకు ద్విత్వమునురాఁగా డెబ్బదియని వచ్చినది.

ఎనుబది = ఎణ్బదు. ఉత్తునకిత్వము. ణకారమునకు నాదేశము. నకారమునకును బకారమునకు ను నడుమ ఉకారాగమము.

తొంబది = తొన్పది. అ. తొల్పది. ఎనిమిదికి ఎనుబది సంబంధించి యున్నట్లు, తొమ్మిదికి తొంబది సంబంధించియున్నది. తొంబది అనునది తొమ్మిది పదికి వచ్చుట ప్రయోగము చేత సిద్ధించును. ఎనిమిది చూడుము.

ఇరువది మొదలయిన పదంబులయందు పదిశబ్దము గ్రామ్యమునందు చేస్తది, వస్తది, చేస్తయి, వస్తయి అని వచ్చినట్లు, పయి అని వికారమునుబొంది, పయి అనుదానికి ఐకారాదేశము వచ్చుటచేత పై అగును.

ఉ. ఇరువై, ముప్పై, నలుభై, యాభై, అఱువై, డెబ్భై, ఎనభై, తొంభై. పకారమునకు వకారమును భకారమును కొన్నిచోటుల నాదేశము.

నూఱు = అ. నూఱు.

వేయి = సం. సహస్రమ్, ప్రాత క. సాసిరం. ఈ కన్నడపదమునందు మొదటి సకారమునకు లోపమును రెండవదానికి యత్వమునురాఁగా, ఆయిరం. దీనికి అంత్యాక్షరలోపమును ఆదియందు వకారాగమమును, ఆకారమునకు ఏత్వమును రాఁగా, వేయి సిద్ధించును.

## సంఖ్యేయనామప్రకరణము.

ఒక్కఁడు = అ. ఒరువన్ + ఉ = ఒరువన్ + డ్ + ఉ = ఒరువండు = ఒర్వండు = ఒక్కండు. రేఫవకారములకు కద్వయాదేశము. కకారమునకు లోపము పాక్షికము, ఒకఁడు.

ఓరి = అ. ఒరువన్ + ఇ = ఒరువ్ + ఇ = ఒర్వ్ + ఇ, ఓర్వి = ఓర్తి. అన్లోపము. రేఫముతోఁ జేరిన ఉత్తునకులోపము. దానికి పూర్వమయిన ఒకారమునకు దీర్ఘము. వకారమునకు తకారము. (అ. ఒరుత్తి.)

ఒక్కతె }
ఒక్కతి } = ఒరువది,
= ఒర్వది,
= ఒక్కది, రేఫవకారములకు కద్వయము.
= ఒక్కతి, దకారమునకు తత్వము.
= ఒక్కతె. ఇత్తునకెత్వము.

ఒక్కటి = ఒక్కదియందు దకారమునకు టత్వము.

ఇద్దఱు }
ఇరువురు }
ఇరుగురు } = ఇరువరు = ఇరువురు. వర్ణసమీకరణవిధిచే తవకారముతోఁ జేరిన అత్తునకుత్వము. వకారమునకు పాక్షిక గత్వము. రేఫముతోఁ జేరిన ఉకారమునకు లోపము.
= ఇరుగురు.
= ఇరువరు : ఇర్వారు
: ఇవ్వారు

రేఫలోపము వకా
రద్విత్వము.

ఇద్దరు = ఇరువరు = ఇర్వరు వకారమునకు దా
= ఇవ్వరు = ఇద్దరు. దేశము.

మూగురు }
ముగ్గురు }
మూవురు }
ముప్వురు }
= మూ + వరు = మూవరు = మూవురు. వకారముతోఁజేరిన అకారమునకు ఉత్వము. మూగురు; వకారమునకుగత్వము; ముప్వురు, ముగ్గురు; ఊకారమునకుహ్రస్వము. దానికి వెనుకనుండు గవలకు పాక్షికద్విత్వము.

నలువురు }
నలుగురు }
= నాలు + వరు = నలువరు. ఆకారమునకు హ్రస్వము.
= నలుగురు. వకారముతోఁజేరిన అకారమునకు ఉత్వము.

అయిదుగురు }
ఆఱుగురు }
ఏడుగురు }
— పైఁజెప్పినట్లు.

తొమ్మండ్రు = తొంబది + వురు.
= తొంబఙ్ + రు; పదియొక్క ఇకారమునకు లోపము. దకారమునకు నా దేశము. వు లోపము.
= తొంబఙ్ + డ్ + రు. నరలకునడుమ డకారాగమము.
= తొంబండ్రు.

పదుగురు
పదువురు
పదురు
= పది + వరు = పదువురు. అంత్యోకారమునుబట్టి వర్ణసమీకరణవిధిచే ఉకారమునకు పూర్వమయిన అకారేకారములకు ఉత్వము.

= పదుగురు; వకారమునకు గత్వము

= పదువురు = పదురు. వులోపము.

ఇరువండ్రు = ఇరు + పది + వరు = ఇరువదువురు = ఇరువవరు = ఇరువనురు = ఇరువండ్రు. పది ఇకారమునకు ఉత్వము, వులోపము ఉలోపము. వకారమునకు నకారాదేశము నకారరేఫములకు నడుమ డకారాగమము

ఇట్లే

ముప్పండ్రు = మూడు + పది + వరు

నలువండ్రు = నలు + పది + వరు.

ఏఁబండ్రు = ఏను + పది + వరు.

అఱువండ్రు = ఆఱు + పది + వరు

డెబ్బండ్రు = ఏడు + పది + వరు.

ఎనుబండ్రు = ఎను + పది + వరు

తొమ్మండ్రు = తొమ్మి + పది + వరు.

నూఱుగురు = నూఱు + వరు.

వేగురు = వేయు + వరు. యుకారమునకు లోపము

ఇట్లు ఇతరశబ్దంబులకు వ్యుత్పత్తులు ఊహ్యంబులు.

